# ఉత్తరాలు

## నెహ్రూగారికి జోహార్లు

అయ్యయో ఎంత ఘోరమ్మైనట్టి వార్త !!
మమ్ము విడనాడి పోయెనే మా ప్రధాని ? !
భారతావని యీ శోకవార్ధినింక
గడచుటే రీతిసాధ్యమో కానరాదు.
భాస్కరుండస్తమింప భూవలయమందు
అర్ధభాగమె చీకటి యావరించు
ధీనిభాసుడౌ నెహ్రూదివికి నేగ
కారు చీకటులంతట గ్రమ్ముకొనియె
అమల గుణఖని ! నీ పదాబ్జములపైని
అర్పణము జేతుమయ్య దుఃఖాశ్రువులను
స్వర్గ సామ్రాజ్యమున నాత్మ శాంతి మనుము
వీర భారతనేత ! జోహారులయ్య

సి. హెచ్. వి. నరసయ్య.

* * *

విమల గాంధర్వ మొలికించు విశ్వవీణ
వెన్న ముద్దలు తినిపించు ప్రేమపాత్ర
అతి మహోన్నత విజ్ఞాన దర్పణమ్ము
పగిలి పోయెను, గుండెలు పగిలిపోయె.
తానె దేశమ్ముగా ప్రతిధ్వనులు సేయు
అమల నాయకమణి కరవయ్యె మనకు,
వెలుగు విరజిమ్మి నిండుజాబిల్లి నేడు
కాలు జారెను మృత్యు మేఘాలవెనుక.

డా. శంకర శ్రీరామారావు (ఏలూరు)

* * *

సీ. నవ్యభారతదేశ, నాయకాగ్రణి వీవె
చరితాత్మకుల, మేటి చరితుడీవె
రాజ్యపాలకులాగ్ర, రణభీతి హరుడీవె
సర్వజనాదరణ సదయుడీవె
అన్యదేశ ప్రభుల, కధిక శ్రేష్ఠుడవీవె
ఆదరింపగ శరణులు, దాతవీవె
సత్యపాలనా హింస శాంతి, నిరతుడవీవె
బుద్ధి గరపెడు ప్రేమ, బుద్ధుడీవె
మేటి గుణధీర భారత, నెహ్రూ దేవ
భరత మాతను దిగ్భ్రాంతి, బడగజేసి
నేడు మముబాసి పోతివా, మహిని విడి
భరత కులదీప భారత, నెహ్రూ దేవ

సింధేరాజ్ (ప్రొద్దుటూరు)

## సినీ మిరపకాయలు

మీ పత్రికలో బాధ్యతలేని విమర్శలు వస్తున్నందుకు చాలా విచారిస్తున్నాను. విమర్శ పేరుతో 'కువిమర్శలు'' జరుగుతూ ఉన్నాయి. ఉదాహరణకు క్రితం వారం (5—6—64) ''సినీ మిరపకాయలు'' శీర్షిక తీసుకొనండి. ఆ శీర్షిక వ్రాసే వారెవరో గాని, పచ్చిమిరపకాయలు ఎక్కువగా తింటున్నట్లు అనిపిస్తుంది. పాలమారుతుంది. తగ్గించమనండి. లేకపోతే ఆ మహాశయుల విమర్శకు అర్థము ఏమిటి ?

రాముడు—భీముడు చిత్రంలోని సంభాషణలు : దర్శకుడు : అమ్మా, నటన అనేది పవిత్రమైన కళ, భీముడుతల్లి : ఆ....నా బొంగకళ అంటుంది. దానికి మీ విమర్శకాగ్రేశ్వరుడుగారి విమర్శ తిలకించండి.

తాపీ చాణక్యగారు (దర్శకుడు), రామానాయుడుగారు (నిర్మాత) డి. వి. నరసరాజుగారు (రచయిత) ఇప్పటి వరకు ఆ బొందకళనే ఆరాధిస్తున్నారా !

మీ విమర్శకుడి అజ్ఞానమునకు మాకు నిజంగా నవ్వు వచ్చింది. పై మాటలు ఎవరినోటి వెంట వచ్చాయి. ఏ సందర్భములో వచ్చాయి. అనే ఆలోచన ఉందా ? భీముడు తల్లి పామరురాలు, ఏమీ తెలియనిది. తన కొడుకు తప్ప ఇతర ఆధారము లేనిది. తన కొడుకు నాటకాల పిచ్చిలోపడి ఇంటి బాధ్యత పట్టించుకోకుండా, తిరుగుతున్నాడని ఆమెబాధ. ఆ బాధలో అన్నది ఆ మాటలు. అయినా ఈ మాట మన తెలుగునాట ఉన్నదే ! ఎవరయినా తన కిష్టములేని పని చేస్తే మోటుగా ''నా బొందరో'' అనటం రివాజు. ఇవేమి ఆలోచించకుండా, వ్రుసుక్కున, ఆ మాటలు రచయితకు అంటగిట్టటమే ! రచయితలెప్పుడూ పాత్రానుగుణంగా సంభాషణలు వ్రాస్తాడు. అంత మాత్రంచేత ఆ మాటలు రచయితవి అనటం ఎంతవరకు సమంజసం ?

ఒక పాఠకుడు (వాల్తేరు)

## కథలు

5—6—64 ఆంధ్రసచిత్రవారపత్రికలో నా కథ ''తేలిపోయింది'' గురించి ఏ. వి. ఆర్. భరద్వాజ ''విశాఖపట్నం''గారి విమర్శ చదివి విచారించాను. కథలో హిందూమత దూషణలే కాక హిందూమత సాంప్రదాయములను, ఆచార వ్యవహారాలను, దేవాలయములను హీనపర్చినట్లుగా ఆరోపించారు. విశాల దృక్పథంతో గమనించక త్వరపడి అపార్థం చేసుకున్నారని అనుకొంటున్నాను.

కథలో యెక్కడా హిందూమత దూషణ లేదు. అట్లాగే ఆచారవ్యవహారములను హీనపర్చినదియు లేదు. ఏ మతాన్ని నపర్చటం కాని, కించపరచటం కాని నా అభిమతం కాదు. జరుగుతున్న సంఘటనలను వాస్తవికంగా చూపించటానికే ప్రయత్నించాను. అందులోని వ్యక్తులు ఏ మతానికి చెందిన వారైనా కావచ్చును. అంత మాత్రాన ఆ మతాన్ని హీనపర్చినట్లుగా కాదు వ్యక్తుల ప్రవర్తన కాలం మార్పుతో పాటు పరిస్థితుల ప్రభావం వలన మారుతూ ఉంటుంది. క్షణికోద్రేకంతో విచక్షణాజ్ఞానం లేక తొందరపడుటవలన ఎటువంటి పరిణామాలు సంభవిస్తాయో చూపించడమే కథయొక్క సారాంశము. అటువంటి సంఘటనలు ఏ మతంలో నయినా జరుగవచ్చు. ప్రస్తుత కాలంలో అటువంటివి అనేకం మనం చూస్తున్నాము.

ఇక సాంప్రదాయాలకు ఆచార వ్యవహారాలకు విరుద్ధముగ ఉన్నది అన్నట్లయితే (లేదనుకోండి) అట్లా జరుగకూడదని ఎక్కడున్నది ? ప్రస్తుత కాలంలో సాంప్రదాయములకు అనుగుణంగానే అవి జరుగుతున్నాయా ? విరుద్ధంగా జరుగుతున్న వాటిని కథా వస్తువులుగ తీసుకోకూడదా ?

ఇక పోతే మతాంతర వివాహములు దేవాలయములలో జరుగవని, అందుకు సమ్మతించరని అన్నారు. అనుమతి లేకుండా ఎన్ని దొంగచాటు వివాహములు కావటంలేదు ? ఇరువురికి ఇష్టమైతే ఆడంబరం, ప్రచారం లేకుండా అతిసాధారణంగ జరుగవచ్చు. పూలమాలలు ఒకరి నొకరు మార్చుకోవటం ద్వారా కూడ పెళ్లి అయిందనిపించుకోవచ్చు. బహుశ అది ''లీగల్'' కాకపోవచ్చు. రహస్యంగా జరిగేది ఎక్కడైన జరుగవచ్చు.

విమర్శించే ముందు ఆ మతం ఈ మతం అనే పక్షపాతం చూపకుండ విశాల దృష్టితో సమాజంలో జరుగుతున్న సంఘటనలను గమనిస్తూ చేయాలి. ఎవరి మట్టుకు వారు వ్యక్తిగతంగా తమకు అన్వయించుకొని ఉద్రేకపడి భుజాలు తడుముకుంటె అది హాస్యాస్పదమే, అవుతుంది. ఒక్కొక్కసారి నిజం చేదుగా ఉంటుంది. అంత మాత్రాన అది నిజం కాకపోదు. భరద్వాజగారు కథను ఇంకొకసారి చదివి వారికి కలిగిన అపోహను దూరము చేసుకొన గలరని ఆశిస్తున్నాను.

జహార్.

## సినిమా వ్యాసాలు !

వారపత్రికలో శ్రీ రామారావుగారి సినిమా పరిశ్రమ వ్యాసాలు చదువుతున్నాను. ఈ వారం ఆంధ్ర ప్రభుత్వం ఉత్తమచిత్ర నిర్మాణానికి 50,000 రూపాయలు బహుమతి ఇవ్వటం జరుగుతుందని ప్రకటించిన విషయములో శ్రీ రామారావుగారు చక్కగా విమర్శించారు చిత్ర పరిశ్రమంటే యేమిటో అందులో ఉండే కష్ట నష్టాలు విడమర్చి చెప్పి ఈ బహుమతియే విధముగా ప్రభుత్వం సమకూర్చితే ఆ పరిశ్రమకు ప్రోద్బలము వస్తుందో సూచించారు. ఒక అగ్రనటుని కొరకు ఒక చోట స్థిరపడ్డ పరిశ్రమ తరలించుట మన్నది ఊహాలోక విషయము మాత్రమే.

శ్రీ సారధి స్టూడియోస్ వారు శ్రీ రంగారావు చదివిన విజ్ఞప్తి పత్రానికిచ్చిన సమాధానము చదివాను. ఏది ఏమైనా వ్యక్తిగత విలువలకు ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వకుండా సంస్థ పురోభివృద్ధికి దోహదమిచ్చి ఆంధ్ర రాజధానిలో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి కాంచాలని అభిలషిస్తున్నాను.

దాసు (పూనా

* * *

గోపాలకృష్ణమూర్తి, సూర్యప్రసాద్ (వాల్తేర్) గారలు వ్రాసిన లేఖ ఈర్ష్యతో వ్రాసినట్లుగా కనపడుచున్నది. ప్రఖ్యాత తెలుగు హీరో, మొదటివాడుగా, అమెరికా వెళ్లటం తెలుగు చిత్రసీమ గర్వకారణం కాదా ! శ్రీ శివాజీ గణేశన్ అమెరికా వెళ్ళినప్పుడు పత్రికలు ప్రచురించలేదా ? వారికి సన్మానాలు జరుగలేదా ?

రాము (భోపాల్)

# చందన్ సన్‌డౌనర్

## సోఫా-బెడ్ కన్వర్టర్ యూనిట్

అధునాతన ఫర్నిచరులో ఇదొక అతి నూతన సాధనం. అసలు ఖర్చే లేకుండా మీ గృహానికి మరొక పడకగదిని సమకూరుస్తుంది— సన్‌డౌనర్ పగలు ఉపయోగకరమైన ఆకర్షణీయమైన సోఫా—ప్రొద్దువాలి రాత్రికాగానే, స్వర్గ తుల్యమైన, స్ప్రింగు కుషన్లుగల 3 అడుగులు వెడల్పయిన పడక. చందన్ సన్ డౌనర్ సోఫా-బెడ్ కన్వర్టర్ ప్రత్యేక సదుపాయాలు గమనించండి.

• మార్చదగిన భుజస్కంధములు—ఎంచుకొనుటకు 4 రిజిస్టర్డ్ పేటెంటు డిజైనులు. ఇది చందన్ ప్రత్యేకత. స్టైన్‌లెస్ స్టీలు, లేక ఎనామిల్డ్ స్టీల్ ట్యూబ్యులర్ ఫ్రేములలో దొరుకుతాయి • అత్యంత శ్రేష్ఠమైన స్ప్రింగుపరుపులు, సొంపునింపే కవరుముగింపు • దృఢమైన ఇ.ఆర్. డబ్ల్యు. ఉక్కు గొట్టపుచట్రం—స్ప్రే పెయింట్ చేయబడి, పొయ్యి మీద కాచబడినది • సరఫరా నిమిత్తం మెత్తలను సులభంగా వేరుపరచవచ్చు • కాళ్ల పాదమున్నిటికీ రబ్బరు తొడుగులు గలవు • ఇంక ధర అంటారా! రూ. **195** మాత్రమే (భుజస్కంధములు అదనం) పన్నులన్నియు అదనం.

చందన్ మెటల్ ప్రొడెక్ట్స్ ప్రైవేట్ లి., బరోడా.


టైప్ 'N'


టైప్ 'T'


టైప్ 'U'


టైప్ 'W'






CMP. 1243 TEL EVEREST

అన్ని ముఖ్య కేంద్రములలో అధికారము పొందిన డీలర్లు గలరు.

# నెహ్రూ ఒక సామాన్యుడి అభిప్రాయం



"—చారిత్రేణ చకోయుక్తస్సర్వభూతేషు కోహితః
విద్యాన్కః కస్సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః—"

మహాత్మా గాంధిని గురించి తన స్వీయ చరిత్రలో జవహర్‌లాల్ నెహ్రూ ఇలా వ్రాశారు :

"ఆయన ఒక అసామాన్య అసత్యాభాసము. మహా పురుషు లందరూ కొంతవరకూ అంతేనేమో ...."

ఇంగ్లీషులో నెహ్రూ 'పారడాక్స్' అనే మాట వాడారు. అదేమాట ఆయనకూ వర్తిస్తుంది. శతాబ్దాలుగా రాని మార్పు లెన్నో దేశ చరిత్రలో కొన్ని దశాబ్దాలలో తీసుకువచ్చిన జవహర్‌లాల్ నెహ్రూ ఎటువంటి వ్యక్తి ? ఆయన సిద్ధాంతాలు ఆయన ఆచరణలకి ఎంతవరకు అనుగుణంగా ఉన్నాయి ? అనే ప్రశ్నలు నేడు, జవహర్‌లాల్ నెహ్రూ ఒక ఉజ్వల స్మృతిగా మాత్రమే మిగిలిపోయిన తర్వాత, చాలా మంది తమకి తామే వేసుకుంటారు.

భారతదేశంలో నెహ్రూకన్నా ఆధునిక దృక్పథం కలవారు లేరని నిస్సందేహంగా చెప్పవచ్చు. అయితే, ఆయన వేషం మాత్రం ఆధునిక ధోరణులుగా చెలామణి అవుతున్నవాటికి విరుద్ధంగా ఉంటుంది. ఇది చాలా చిన్న విషయం, కాని పెద్ద విషయాలలో కూడా ఇటువంటి 'పారడాక్స్'లే కనిపిస్తాయి.

ముఖ్య విషయాలలో కొన్ని మన సాంఘిక—ఆర్థిక విధానాలు. మొదటినుంచీ జవహర్‌లాల్ నెహ్రూ తనకి 'సోషలిజం' పట్ల ఉన్న అభిమానం, నమ్మకం — వీటిని గురించి చెప్పుకుంటూనే వస్తున్నారు.

ఈ విషయంలో మహాత్మా గాంధి అభిప్రాయాలు చాలా వెనుకబడి ఉన్నాయని స్వీయ చరిత్రలో స్పష్టంగా వ్రాశారు. స్వాతంత్ర్యం అనంతరం ఏవిధమయిన పారిశ్రామిక, సామాజికాభివృద్ధి రావాలో వివరంగా చెప్పారు. కమ్యూనిజం పట్ల ఇంకా మొగ్గుతున్నట్లు ఒకచోట అన్నారు కూడా.

గాంధిగారి అభిప్రాయాలు కొన్ని తమకి సమ్మతం కావని నిర్మొహమాటంగానే వ్రాసినా చివరికి గాంధి విధానాలని ఎప్పుడూ నిజంగా ఎదిరించ లేదు. 'తీవ్రమయిన పద్ధతులు ఎన్నటికీ మంచివి కావ'నే వాదనతో గాంధినే అనుసరించారు. చివరిదాకా ఇదే మార్గాన్ని అనుసరించారు. అందుకనే ఒక బ్రిటిష్ రచయిత అన్నాడు, నెహ్రూ 'విప్లవం మాట్లాడినా నిగ్రహం చూపిస్తా'రని. (ఒక విధంగా చూస్తే మహాత్మాగాంధి నిగ్రహంగా మాట్లాడి విప్లవాత్మకంగా ఆచరిస్తారేమో అనిపిస్తుంది.)

పైన చెప్పిన నిగ్రహం విదేశ విధానాలలో మాత్రం అంతగా కనిపించదేమో. తటస్థ విధానం తప్ప వేరే ఏదీ మన దేశానికి తగదని నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని ఆచరణలో భారతదేశం తటస్థ విధానాన్ని పూర్తిగా అవలంభించలేదని అంగీకరించాలి. అనవసరమయిన విషయాలు కొన్నిటిలో కల్పించుకొనటమే కాక కొన్నిటిలో అతి ఉదాసీనంగా ఉండటం జరిగింది. రష్యాని బలపరచినంతదాకా భారతదేశంలో కమ్యూనిస్టులకి దెబ్బగానే ఉండటం నిజం. (ఇంత బీద దేశంలో కమ్యూనిస్టుల ప్రభావం ఇంత తక్కువగా ఉంచటం తేలికపని కాదు.) అంతేకాక, సైనిక, ఆర్థికశక్తి అతి తక్కువగా ఉన్నా భారతదేశానికి అంతర్జాతీయంగా చాలా పేరు వచ్చిందంటే తటస్థ విధానమే దానికి కారణం.

చైనా దురాక్రమణ చేసినప్పుడు పశ్చిమ దేశాలే మన సహాయానికి రావటం కూడా జవహర్‌లాల్ నెహ్రూకి చిన్నతనంగా భావించటానికి వీలులేదు. ప్రపంచంలో కెల్లా పెద్ద ప్రజాస్వామికానికి నియంతృత్వం అపాయం లేకుండా కాపాడుతూ 'వచ్చిన నెహ్రూకి పాశ్చాత్య దేశాల శీఘ్ర సహాయం గర్వ

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 19—6—'64
(క్రోధినామ సం॥ జ్యేష్ఠ మాసం॥ శుద్ధ దశమి
సంపుటము 56 సంచిక : 42
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు: ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120 00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న.పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1



'ఇలా తీసి పారేద్దామనుకుంటే వాళ్ళు అసలు కామరాజ్ పథకం చెయ్యడం ఎందుకుటా ?'
"మొరార్‌జీ ప్రధాని కాకుండా చెయ్యాలనేగా అది చేస్తే! అదని కాస్తా అయిందిగా మరి ?"

## మన లో మాట

1946లో జవహర్‌లాల్ నెహ్రూ బొమ్మ ఒకటి అట్ట మీద వేద్దామనుకుంటూనే ఉన్నాము కాని ఆయన ముఖచిత్రం ఇటువంటి పరిస్థితులలో వెయ్యవలసివస్తుందని ఎలా ఊహించ గలిగి ఉండేవాళ్లం? పోయినవారమే నెహ్రూ ముఖచిత్రం ఎందుకు ప్రచురించలేదని కొందరు వ్రాశారు. ఇక్కడ మాకున్న ముద్రణ ఏర్పాట్ల ప్రకారం అది వీలయ్యేదికాదు. అసలు 19-6-'64 సంచిక ముఖచిత్రం వేరే తయారయిపోయి నప్పటికీ అతికష్టంమీద దానిని తీసివేసి జవహర్‌లాల్ నెహ్రూ బొమ్మ అట్టమీద వేసే ఏర్పాట్లు చేసుకున్నాము.

* * *

శ్రీయుతులు ఆరుద్ర, జగ్గయ్యల పద్యాలకి బొమ్మలు శ్రీ బాపు వేశారు.

* * *

'వియత్నాం వింతలు' ఈ వారం సంచికలోకి ఎందుకు మార్చవలసివచ్చిందో పోయినవారం సంచికలో చెప్పాము...

* * *

6వ పేజీలో బొమ్మక్రింద వేసిన మాటలు వాల్మీకి రామాయణం లోనివి.

* * *

'వనితావాణి'కి వ్రాసేవారు చాలామంది చిన్న వ్యాసాలు పంపుతున్నారు! ఈ శీర్షికకి వ్రాసేవారు చిన్న ఉత్తరాలు మాత్రం పంపితే బాగుంటుంది అంతేకాక, ఉత్తరాలు మరీ పాత వ్యాసాలమీద కాకుండా ఉంటే బాగుంటుంది. 'వనితావాణి' రచయిత్రులు కొందరు తమ పేర్లు ఇంగ్లీషులో వ్రాస్తూ ఉంటారు. పేర్లు తెలుగు లిపిలో లేని వాటిని వీలయినంత వరకూ ప్రచురించకుండా ఉండాలనే చూస్తూ ఉంటాము! ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

కారణమే అని చెప్పాలి. గర్వకారణం కానిది చైనా దురుద్దేశాలని గ్రహించకపోవటమే కాక ప్రజల దృష్టి నుంచి వాటిని మరుగుపరచటం.

ఎంత మరుగుపరచినా, ప్రజలకి నెహ్రూమీద ఉన్న అపార ప్రేమ తగ్గలేదు. ఎప్పటిలాగే ఆయన సభలకి లక్షలు లక్షలుగా వస్తూనే ఉన్నారు. ఈ ప్రజాబాహుళ్యంయొక్క సాన్నిహిత్యమే జవహర్‌లాల్ నెహ్రూకి చెప్పలేనంత బలం, ఆత్మవిశ్వాసం ప్రసాదించేదని ఆయనే చెప్పుకున్నారు. ఎంత అలిసిపోయి ఉన్నా, ఎంత ఆవేదనకి లోనయినా ఒక పెద్ద బహిరంగసభ చెయ్యగానే అన్నీ తీరిపోయి కొత్త మనిషి అయిపోయినట్లు ఉండేది నెహ్రూకి.

కాని, "ఎన్నటికీ (ఈ గుంపులో) నేను మునిగిపోలేదు. ఎప్పుడూ వారికన్నా వేరుగానే ఉన్నానని అనుకునేవాడిని ...." అని స్వీయచరిత్రలో వ్రాశారు జవహర్‌లాల్ నెహ్రూ.

ప్రతిరోజూ నిద్రలేచి నప్పటినుంచీ మళ్లీ పడుకునేదాకా ప్రపంచంలో అన్ని విషయాలమీదా ప్రధానమంత్రి అభిప్రాయాలు, ఆయన ఉద్బోధలూ, ఉద్ఘాటనలూ చదువుతూ వింటూ ఉన్నవారందరికీ ఇది వింతగా ఉంటుంది. నిరంతర ప్రజల దృష్టికి లోనయిన వ్యక్తి ఏకాంతం అనేది కోరకుండా ఉంటాడా అనిపిస్తుంది. ఆయన స్వీయచరిత్ర చదివితే ఈ అనుమానం బలపడుతుంది. వ్యక్తిగతమైన వివరాలు ఎన్ని చెప్పినా, తన కుటుంబానికి సంబంధించిన విషయాలను గురించి ఎంత వ్రాసినా నిజంగా 'గుండె విప్పి మాట్లాడటం' లేదనే భావం పాఠకుడికి కలుగకమానదు. కొన్ని చోట్ల ఆశ్చర్యం కలుగుతుంది కూడా, కాశ్మీర్ బ్రాహ్మణులలో వర్ణాంతర వివాహాలకి అభ్యంతరాలని గుర్తించి వ్రాస్తూ, "ఇతరులతో వివాహాలకు అడ్డుపడేది మతాభిమానం కాదు. చాలామట్టుకు జాతికి సంబంధించిన అభిమానమే. చాలామంది కాశ్మీరీలకు మా వర్ణ సారూప్యం, విశేషమయిన ఆర్య లక్షణాలు—వీటిని భద్రంగా ఉంచాలనే కోరిక ఉంటుంది. భారతీయ, భారతీయేతర మానవ సముద్రంలో ఇవి మునిగిపోతాయనే భయం ఉంటుంది. ఈ పెద్ద దేశంలో మేము చాలా తక్కువ మందిమి," అంటారు. కాని జవహర్‌లాల్ నెహ్రూ కుటుంబంలో వివాహాల వివరాలు పరిశీలిస్తే ఈ భయాలకీ, సంకోచాలకీ ఆయన ఎంత లోనయ్యారో తెలుస్తుంది!

'మతం' విషయంలోనూ నెహ్రూ ఒక పెద్ద 'పారడాక్స్.' హైందవ తిరోగమనవాదుల బారి నుంచి దేశాన్ని రక్షిస్తూ రావటమే కాక కుటుంబ నియంత్రణ, గోవధ మొదలయిన విషయాలలో అసామాన్యమయిన ధైర్యం ప్రదర్శించారు. జవహర్‌లాల్ నెహ్రూ తప్ప ఇంకెవ్వరూ ఇంత నిర్మొహమాటంగా ఈ సమస్యలని ఎదుర్కోలేరు, ఎదుర్కొనలేరు. కేవలం పూజలూ పునస్కారాలూ మన మతం కావని చాలామంది, చాలాకాలం నుంచి చెబుతూనే వచ్చారు. నెహ్రూ వీరిలో ఒకరే కాని మానవజాతి ఉద్ధరణకి సంబంధించిన అంశాలని మాత్రం గుర్తించటంవల్ల ఆయన అభిప్రాయాలు నేటి పరిస్థితులకు మరింత ఉచితంగా ఉన్నాయని చెప్పవచ్చును.

"నేను తూర్పు పడమరల వింత కలయికనయిపోయాను నా కెక్కడా స్థానంలేదు ఎక్కడా చెందను. నా భావాలు, జీవితానికి సంబంధించిన ఊహలూ తూర్పుకన్నా పడమరకే దగ్గరగా ఉంటాయేమో కాని భారతదేశం నన్ను ఆవరిస్తుంది—ఎన్నో విధాల ఆమె సంతానాన్ని అందరినీ ఆవరించినట్లే. నా వెనుక అచేతనంగా వంద తరాల, సంఖ్య ఎంతయినా కానీయండి, బ్రాహ్మణుల జాతీయ చైతన్యాలు మెదులుతూనే ఉంటాయి."

అని వ్రాశారు జవహర్‌లాల్ నెహ్రూ ఒకచోట. జాతి చైతన్యం ఉన్న ప్రతి భారతీయుడిలోనూ ఇటువంటి కల్లోలం కలుగుతుంది. నెహ్రూ వంటి నాయకులలో ఇది చాలావరకూ దేశాన్ని చెడిపోకుండా కాపాడిందేమో ....

తన వీలునామాలో నెహ్రూ తన అంత్యక్రియలు ఎలా జరగాలో చెప్పారు. తన అస్థికలన్నీ చితాభస్మాన్నీ గంగలో, భారతదేశపు భూమిమీదా చల్లాలని కోరారు.

జవహర్‌లాల్ నెహ్రూయే భారత దేశం.

ఒక సామాన్యుడు.



# నెహ్రూ తరవాత? నెహ్రూయిజం!

ఆరుద్ర

రాకూడదనుకొనే రోజు
రాక్షసిలాగ విరుచుకుపడింది
పోకూడదనుకునే పువ్వు
రేకులురాలి వాడిపోయింది
చెరగరాదనుకొనే నవ్వు
స్మృతిపథంలోనికి వలసపోయింది
గతంలోంచి మతంలోంచి
గంధకజ్వాలలు రానివ్వని హస్తం
అహర్నిశలూ తా ధరించే
అభయముద్ర విడనాడింది
దిక్కరీంద్రుల భారమంతా వహించే
ఒక్క భుజమూ పక్కకు తప్పుకుంది
జాగ్రదవస్థలో పీడకల
జాతిని భయపెట్టింది
పుడమితల్లికి పొంగిపొరలి
పుత్రశోకమొచ్చింది

విశ్వంకన్నా విశాలమైన హృదయం
పిడికెడు బూడిదగా మారింది
పాతచితాభస్మంలోంచి
నూతనశకాన్ని ప్రోగుచేశాము
ఆగకుండా పరిగెత్తే నదీనదాలకు
ఆనకట్టలైంది అతని అస్థిసంచయం
కార్యవాది తేజస్సు మిన్నంటి
సూర్యబింబానికే వెలుగునిచ్చింది
శాంతిఘాటు పుణ్యసీమలో
సమధర్మం చిగురించింది
ప్రబోధాల పరిమళాలు విహరించి
ప్రాణవాయువులకే మెరుగుపెట్టాయి
జీవించినా మరణించినా
దీక్ష వీడనిదెవ్వరు?
చిరంజీవి! చిరంజీవి!
చిరంజీవి మా జవహరు!





# అమ్మా! భారతి!

- జగ్గయ్య

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

గంగానది తీరంలో
పుట్టిందొక పుణ్యశక్తి,
యమునానది తీరంలో
కడతేరిన ఆత్మశక్తి—
ఆ సంగమయాత్ర కయ్యె
త్రైవింశతి వత్సరాలు !
నవభారత ఇతిహాసం
చివురించిన బీజాక్షరాలు,
నరజాతికి చైతన్యం
కురిపించిన జలధరాలు,

కాలానికి సారథిగా,
చరిత్ర కొక సాక్ష్యంగా,
నెహ్రూ రూపం తొడిగిన
భవితవ్యపు తోరణాలు !

ముగిసినవా ప్రయాణాలు
ముసురుకొన్న చితిమంటల !
మిగిలిన విక మా గుండెలు
రగులుకునే స్మారకాలు !

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి

పసిబాలుడి హృదయంతో,
తల పండిన జ్ఞానంతో,
బాధార్తుల ప్రతినిధిగా
న్యాయానికి పందిరిగా,

మాలో మసలిన మానవరూపం,
చరిత్ర పెట్టిన జేగురు దీపం,
ఏదమ్మా యిపుడే దమ్మా యిక !

మా భారం మోసి మోసి
మా ఆశలు రాశి పోసి,
అలసిపోయి, అణగిపోయి,
నవనాడులు క్రుంగిపోయి,
పిడికెడు మన్నై పోయిందా ?
జడి చుమ్మలలో ముంచిందా ?

కాలానికి గుండె తెగి,
కన్నీటికి గండిపడి,
వందకోట్ల మనస్సుల మొగలో
చీకటి కుండలు పగిలినవమ్మా !

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

వెగలే వల్లని పొగ క్రమ్ముకు పోయింది,
జగత్తులో చలనం గడ్డకట్టి పోయింది,
జాతికి వెలగడే తీగ విచ్చి పోయింది,
నెహ్రూ పొందిన ప్రాణం నివురుగప్పి పోయింది.

చిరలప్పిట పతాకాలు
దీనంగా తల వాల్చినవి,
మూడు ఖండాలలో ప్రజల
మూగబాధ మిన్నంటినది,

ఈ దేశం బిక్కచచ్చి సొమ్మసిల్లి పోయినది,
రక్తబంధ మున్నెవగా రాజధాని చేరినది . .

అమ్మా భారతి! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

గులాబీలు విలపిస్తున్నవి,
శిశు హృదయం రోదిస్తున్నది,
పుడమి తల్లి కడుపు కోత
పిడుగులా కంపిస్తున్నది,
ప్రతి గొంతున గాద్గద్యం,
ప్రతి మనసున నిస్తబ్దం,
ప్రతి హృదయాన కత్తిపోటు,
ప్రతి మనిషీ ఉష్ణ గంగ—

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

ఇంకేమున్నది ? ఇంకేమున్నది ?
ప్రళయం విరుచుకు పడుతున్నది !

"మా జవహరు అంత్య యాత్ర,
మా మమతల చరమ యాత్ర !

అడియారని పాదాలకు
ప్రణమిల్లెను జనసంద్రం—
చలి గప్పిన దేహంపై
తొడిగించెను పూలరగ్గు—
ఎడబాసిన భరతాత్మకు
విడిచెను ఋణ తర్పణాలు—

మా జవహరు అంత్య యాత్ర,
మా మమతల చరమ యాత్ర !

ఈ బిలగం, ఈ బంధం
తెగతెంపులు చేసి యిపుడు,
నీడలేక, తోడులేక,
తిరిగిరాని పయనంపై
ఏకాకిగ, ఏకాకిగ
పోతున్నాడమ్మా !
మనసిచ్చిన మా దేవుడు
మాటయినా చెప్పకుండ,

ఆరడుగుల అందలాన,
ఆక్రందనాల మధ్య,
అగ్ని శిఖల కాహుతియై
పోతున్నాడమ్మా !

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

బానిసగా పుట్టిన మనిషికి
"మానవమే" మొలిపించాడే !
కదలలేని కరచరణాలకు
కదను నేర్పి ఉరికించాడే !
చెదరిపోయిన వ్యధితజాతిని
హిమాచలంగా నిలబెట్టాడే !
నడిమి సూర్యుడై నవ్వు బలంతో
తూర్పు ఎడమరలు కద దోశాడే !

ఏడవమ్మా ఆ వల్లని భానుడు ?
ఏమా నోముల పెత్తిని పాపడు ?
అస్తమింగతుడైనాడా ?
అంతరించిపోయాడా ?

మా నొసటల మందరేఖ
తుడవాలని, కడగాలని,
కావాలని తానిప్పుడు
బూడిదయై పోయాడా ?
వెలిబూదై మిగిలాడా ?

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

మితిమీరిన మంచితనానికి,
విరబూచిన మానవతకూ,
సాధించిన చరిత్రగతికీ,
ఊహించిన ఊర్ధ్వఫలానికి,
ప్రధాని భవనం, భౌతిక వసతీ,
చాలలేదనీ, చాలబోదనీ

"శాంతిఘాటు"కే జగ మూరాడా?
చిర విశ్రాంతికి తీరం దించావా ?

బుద్ధుని వలె కోరికలను
కూలద్రోసుకున్న భిక్కు,
జీససు వలె ఆపన్నులకై
నెత్తురు కార్చిన శుద్ధుడు,
బాపూ వలె సత్యాన్వేషణ
సాగించిన కర్మయోగి,
"మనిషి" జయించే మహోదయానికి
బిడారు ఎత్తిన యాత్రికుడు;

ఏడమ్మా ఆ నవతాబాబు .
లేడమ్మా ఆ జనతాత్మషి !
చితి బయలే వీడుకోలు !
అస్థికలే అనువయాలు !

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

ఈ రోజున లోకానికి ఎదురుదెబ్బ తగిలింది!
ఈనాడే విశ్వశాంతి వెన్ను విరిగిపోయింది!
మానవతకు మారుపేరు మరణించింది !
కారుణ్యపు దేవళమే నేల కూలిపోయింది !
ఈజాతికి మిగిలిందిక 'నిన్న' ఒక్కటేనమ్మా
"జవహ" రన్న పేరికపై జ్ఞాపకమేనమ్మా !

అమ్మా భారతి ! అమ్మా భారతి !
ఆరిపోయె నీ ఆశల హారతి !

[27 మే '64]


కామరాజ్ పథకం
అంత్యక్రియలు
కన్నీళ్లు కార్చేవారు
ఎవరూ లేరు


కాబినెట్ బస్సు
బస్సు దాటి
పోయింది!
కె.డి. మాలవ్యా


ఇదివరకు
అదుపుచేసే-
అసలు శక్తి
కాంగ్రెస్ అధ్యక్షుడు


ఇప్పుడు
ప్రధాని
పదవి



కొత్త ప్రధానిగా ఏకగ్రీవంగా ఎన్నికైన శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి (వయస్సు 60 సం॥ లు) పత్రికా విలేఖరుల గోష్ఠిలో నెహ్రూ విధానాలే తనవి ఔతాయని చెప్పారు.

రాజధాని కబుర్లు

# హైద్రాబాద్‌లో ఇండియన్ నేషనల్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సభలకి సన్నాహాలు!

హైదరాబాదు పట్నం చాలా హడావిడిగా ఉంది. మే నెల మండు వేసంగికి పేరుపెట్టింది. అందులోనూ ఈ ఏడాది, వేడిగాల్పుల తీవ్రత రాజధాని ప్రజలు చవిచూచారు. అయినప్పటికీ భారీ ఎత్తున ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసువారి మహాసభలు జరగటానికి సన్నాహాలు చురుకుగా సాగిపోయినాయి. ఢిల్లీ నుంచి అగ్రనాయకులు వస్తారని నలుగురూ ఎదురు చూస్తున్నారు. ఓ మూల మునిసిపల్ ఎన్నికల సంరంభం జోరుగా సాగిపోతోంది. నామినేషన్స్ దాఖలు చెయ్యటానికి ఆఖరి తేదీన అభ్యర్థులు పోటీలు పడ్డారు. ఎన్నికల వాతావరణం పూర్తిగా నగరాన్ని పెనవేసుకు పోయింది. ఇక మిగతా వ్యవహారాలు మామూలుగానే జరిగిపోతున్నాయి. మే నెల, 27వ తేదీ, మధ్యాహ్నం రెండు, మూడు గంటలదాకా, ఎవరి పనుల్లో వాళ్ళుండి పోయారు. వివిధ భారతి ప్రసారం ఆగిపోయి క్షణాల్లో పిడుగులాంటి వార్త వచ్చిపడింది. ఎక్కడి వాళ్ళక్కడ స్తబ్దులై నిశ్చేష్టులయి పోయారు. పండిట్ నెహ్రూ, శాశ్వతంగా మనల్ని విడిచిపెట్టి పోవటమా! ఇది జరగనిపని అంటూ నిర్విణ్ణులయ్యారు. హృదయ సంచలనం ఆగినట్లనిపించింది. రేడియోల ముందు గుమికూడి ఒక్కొక్కటే వింటుంటే, పిచ్చెత్తి పోయినట్లనిపించింది.

ఆ ఉదయమే శ్రీ జవహర్‌లాల్‌కు గుండె పోటు వచ్చిందని కాని, పక్షవాతపు పడి ఉన్నారని గాని, చాలా మందికి తెలీదు. అందుకే మధ్యాహ్నం తెలిసిన ఈ హఠాత్తు వార్త విని తట్టుకోలేక పోయారు. షాపులన్నీ మూత పడిపోయినాయి. హోటళ్ళ తలుపులు మూసుకు పోయినాయి. సినిమాల గేట్లు తెరవలేదు. జంటనగరాల్లో వీధుల వెంబడి వెళుతుంటే, వ్యక్తిగతమైన ఘోర విపత్తు వాటిల్లినట్లు, వెక్కివెక్కి ఏడుస్తున్న దృశ్యాలు, లోపల లోపలకు కుమిలిపోతున్న మూగబోయిన ప్రజ, ఎంత పని జరిగింది అంటూ గుండెల మీద చేతులు పెట్టుకుని విడ్డూరపోతున్న సన్నివేశాలు కనిపించినాయి. ఇక్కడ ఒకర్ని ఒకరు ఓదారించాలనే ప్రసక్తేమీ లేదు. అందరూ శోకతప్త హృదయాలే! అందరూ, తమ అమూల్యమైన రత్నాన్ని పోగొట్టుకున్నవాళ్ళే!

భువనేశ్వర్‌లోకి పండిట్‌జీకి వచ్చిన సుస్తీమాట విని, అందరూ భయపడ్డారు. కాని క్రమక్రమంగా కోలుకున్నట్లు తెలుసుకుని గండం తప్పిపోయినట్లే అని సంతృప్తిగా నిట్టూర్చారు. నెహ్రూయే అన్నారు ఈ మధ్యనే, తాను ఇంకా ఇరవై యేళ్ళ దాకా బ్రతుకుతానని, తన జీవితవు ముగింపు త్వరలో రాదని. ఆయన కొచ్చిన సుస్తీ మాటే మర్చిపోయి, మామూలు ఆరోగ్యవంతమైన జవహర్‌లాల్‌గానే భావిస్తూ వచ్చారు. ఇంత హఠాత్తుగా ముంచుకొస్తుందని ఎవ్వరూ అనుకోలేదు. ప్రశాంతంగా, దుఃఖపూరిత వదనాలతో, రెండు లక్షల ప్రజలు వీధుల వెంబడి నడిచి, చార్మినార్ దగ్గర, తమ ప్రియతమ నాయకునికి శ్రద్ధాంజలి సమర్పించటానికి, సమావిష్టులయ్యారు. ఒక హైదరాబాదులోనేమిటి, ఒక్క భారత దేశంలోనేమిటి అన్ని దేశాల్లోని అశేష ప్రజానీకం, ప్రధాని నెహ్రూ అస్తమయానికి విలపించింది. వివిధ రాజకీయ పార్టీలవారు, వర్తక వాణిజ్య సంస్థలవారు, అన్ని మతాలవారు, దుఃఖ సముద్రంలో

49 వ పేజీ చూడండి

## వనితాలోకం 'ప్రత్యేకవ్యాసావళి'లో ఐదవ వ్యాసం




**"మన ఆహారంలో కావలసినంత వైవిధ్యం ఉందాలేదా" అంటే అట్టె లేదనే చెప్పాలి.**

మన ఆంధ్రులనేకాదు. ఒక ప్రత్యేక జాతి ఆహారంలో పరంపరగావస్తున్నఆహారవ్యవహారాలనిపాటిస్తూ ఆ జాతి ప్రత్యేకఆహారాన్ని తీసుకుంటే అలాంటి వారి ఆహారంలో వైవిధ్యం ఉండడం చాలా అరుదు. ఆంధ్రులనగానే గోంగూర పచ్చడి ఆవకాయతోటీ, అరవలనగానే ఇడ్లీ సాంబారు తోటీ, బెంగాలీలు అనగానే చేపలతోటి సందేష్ రసగుల్లాలతోటి సమన్వయించడం పరిపాటి. ఇతరులని అనుసరించకుండా ఎవరి పద్ధతి వారికిఉంటే ఆహారంలో వైవిధ్యం వుండటం చాలా కష్టం.

### తాతయ్యచెప్పిన తెనుగు భోజనం

అసలు మా తాతయ్య చెప్పినట్లు అసలుసిసలు పదహారణాల ఆంధ్రుల భోజనంఅంటే కమ్మని ఆవు నేయి, దోరగా వేయించి ఉడికించిన కందిప్పప్పు, ముద్ద కూరో, పులుసుకూరో, ముక్కల పులుసు చింత పండు చారుతో బాటు గుమ్మ పెరుగూ, రాత్రిళ్లలో చారు, అరటికాయదో కొబ్బరి కాయదో పచ్చడి సరే ఆవకాయ మొదలైన ఊరగాయలు చెప్పక్కర్లేదు.

ఆహార విలువలను తీసుకుంటే మన ఆహారం మంచి పుష్టికరమైనది.

మంచి పుష్టికరమైన ఆహారం అంటే ఏవిటి? అసలు ఆహారం శక్తి కోసరం తినాలని మన అందరికీ తెలిసినదె. కడుపుకి కావలసినంత తినకపోతే నీరసించిపోతారు. కావల్సినంతే కాకుండా సరియైన పుష్టికరమైన ఆహారం ఆరోగ్యానికి చాలా అవసరం.

అసలు ఆహార పదార్థాలలో క్రొవ్వు పదార్థాలు, మాంసకృత్తులు, లవణాలు, విటమినులు, నీరూ ఉండాలి. ఇవి సరియైన పాళ్ళలో ఉండాలి. మన దక్షిణ హిందూ దేశపు సామాన్య మానవునికి కనీసం రెండువేల ఆరువందల కెలోరీల శక్తినిచ్చే ఆహారం కావాలని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దానికి సుమారుగా రోజుకి 10 అవున్సుల బియ్యం, ఐదు అవున్సుల గోధుమలు, మూడు అవున్సుల పప్పులు, కూరలు ఆరు అవున్సులు, ఆకు కూరలు నాల్గు అవున్సులు పళ్ళు రెండవున్సులు, పాలు ఎనిమిదవున్సులు కావాలి అంటారు. మనకి కావలసిన విటమినులు కారెట్టు, లివరు, దంపుడు బియ్యము, ఈస్టు, మొలకెత్తు గింజలు, నిమ్మ జాతి పళ్ళు, లివరు నూనెలు, గుడ్డు; ఆకు కూరలులో ఉంటాయి.

దీని దృష్ట్యా చూస్తే క్రొవ్వు పదార్థాలు నేతిలోనున్నాయి. మాంసకృత్తులు పప్పులో ఉంది. సరే బియ్యం పెరుగూ కూరలు అన్నీ తింటున్నాం కదా! అందువలన మన ఆహారం పుష్టికరమైనది!

కానీ వెరైటీ మన ఒక్క ఆహారంలోనే కాదు ఏ ఒక్క జాతి ఆహారంలోనూ ఉండదు. ఏదో ఒక పద్ధతి ననుసరించి చేసినవే, చేసుకుంటు తిన్నవే తింటూ ఉంటారు.

ఈ కాలంలో మన ఆడవారు అటు రాజకీయాల దగ్గర నుండి ఇటు వంటల వరకు అన్ని జాతులఆచారల జాగ్రత్తగా చూస్తూ వస్తున్నారు. మిగిలినవారు అన్నీ ఎలాగ చేస్తున్నారో తెలుసుకోవాలన్న కోర్కె ఎక్కువయింది.

పూర్వపు వారిలాగ ఎవరూ ఉన్నచోటే ఉండిపాత పద్ధతులలోకి తింటూ తిరుగుతూ ఉండాలని అనుకోవడం లేదు. అన్ని పూర్లనీ చూడాలని వివిధ జాతుల ప్రజలని చూడాలనీ, వివిధ జాతుల పద్ధతులనీ నేర్చుకోవాలన్న కౌతుకం పెరిగిపోతుంది. దుస్తులలో వైవిధ్యం కావాలని కోరుతున్న స్త్రీలు వంట పదార్థములలోవైవిధ్యం కావాలని కోరుకోవడంలో ఆశ్చర్యం లేదు.

వెరైటీ ఈస్ ది స్పైసెస్ ఆఫ్ లైఫ్ కదా!

### తినగ తినగ గారెలుచేదు

తినగా తినగా గారెలు చేదు అయినట్లు గృహిణి ఎంత చక్కగా వండినా రోజూ ఏ అనపకాయదో గుమ్మడి కాయదో ముక్కల పులుసు, అరటికాయో, వంకాయో ముద్ద కూర చేస్తూ వస్తే ఆ ఇంటి వారికి రోత పుట్టడంలో ఏమీ ఆశ్చర్యం లేదు.

అందుకనీ ఓపిక ఉన్న ఆధునిక యువతి, వంట అంటే అదో దుర్భర ప్రయోగం, రోత పుట్టించే పని అని అనుకోని స్త్రీ; పట్టణాలలో ఉంటూ ప్రక్కనే ఉన్న అన్యజాతుల వారిని అడిగి సాంబారులూ కూటులూ, సందేష్ మొదలైన తీపివంటలూ, పాశ్చాత్యులలాగా పచ్చి కూరల సలాడ్స్, అవీ నేర్చుకుని ఇంట్లో వారికి జిహ్వకి రుచిగా రకరకాలైన శాకపాకాదులను చేసి పెట్టడం మొదలు పెట్టింది.

'రుచి మరిగిన పిల్లి' చందాన ఇంట్లోని వారు ఈ వెరైటీ' కావాలనడం చేసినవే చేస్తే 'బోర్' అనడం మామూలయింది. అయిదేళ్ల అమ్మాయి కూడా "అమ్మా! మళ్ళీ ఇవాళా మజ్జిగ పులుసే 'బోర్ కొట్టేస్తున్నావు" అని విమర్శిస్తుంది, ఆ 'బోర్' అన్న పదానికి అర్థం తెలిసినా తెలువక పోయినాను.

అసలు పూర్వంలాగ కాక వివిధ రకాలైన కూరలు కూడా వస్తున్నాయి. మా అమ్మమ్మ అప్పట్లో వాళ్ల చిన్న తనంలో లేని ఈ 'ఇంగ్లీషు కూరలు' ఇప్పుడు చాలా వస్తున్నాయి. బఠాణీలు, కాలీఫ్లవరు, కాబేజి లెస్ట్యూ, బీటురూటు దుంపలు ముల్లంగి ఇవన్నీ ఇతర ప్రాంతాలలోను ఇతర దేశాలవారినీ చూసి మన వారు కూడా వండటం మొదలెట్టారు. కారటు, బీటు

...లు వాళ్ళేలు, వివిధ రకాల వంటల్ని పరిశోధ నలు చేసినట్లు తయారు చేస్తున్నారు.

అందుకనే మనకి వీలయినంత మేరకు ఇతరుల నుండి నేర్చుకోవటం సరియైనదే. వారికకి రుచిగా వివిధ రకాలైన వంటలని చేసి ఇస్తే గృహిణిని మెచ్చుకోని కుటుంబం ఉండదు. తనవారికీ తనకీ రకరకాలు చేసుకోవడంలో తృప్తిని చెందుతుంది గృహిణి.

''ఇవాళ ఏం వండావమ్మా!' అనే ప్రశ్న చాలా మందికి ఎదురవుతుంది. అప్పుడు, చేసినవీ, చెయ్యని కూడా చేరి 'మా ఇంట్లో క్యాబేజీ బటానీల కూర, బంగాళా దుంపల వేపుడు, ఉల్లిపాయ సాంబారు, కొబ్బరికాయ పచ్చడి, నిమ్మకాయ చారు, టొమాటోలూ, కారెట్లులూ సలాడ్......'' అని వల్లెవేస్తూ పోయేవారిని నేను ఎరుగుదును. ఎందుకీ తాపత్రయం? అంటే వారి ఇంట్లోనూ వంటల రకాలు వక్కూ వైవిధ్యం ఉందనీ, చాటుకోవడమేను.

ఆమధ్య కొంతమంది స్నేహితుల ఇళ్ళలో పెళ్ళిళ్ళు జరిగాయి. అందరిళ్ళ భోజనాలలోనూ సాంబారు, అవియలు, కూటూ, అరటికాయ కూర, అప్పడాలు వగైరా. అలాగే మా గ్రామంలో కొన్ని పెళ్ళిళ్ళు జరిగితే వెళ్ళాం. వరుసగా జరిగిన ఈ పెళ్ళిళ్ళ వలన ఒకనెల రోజులపాటు, గుమ్మడి కాయ పులుసు, వంకాయి ముద్ద కూర, పులి హోర, బూరెలు ఇలానే తిని తిని చాలా అలసి పోయాం. పెళ్ళివారంతా వెళ్ళాక మా మేనత్త చేసినది చారు, కొబ్బరికాయ పచ్చడీ అయినమా అమృతంలా భావించి తిన్నాము. సంతర్పణలలో చేసే వంకాయకూర ఇష్టంలేకకాదు. అయితే దీనికి కారణం ఏవిటి? కానీ అదేపనిగా దానినే తింటే మొహం మొత్తుతుంది. 'తినగ తినగ వేము తియ్యనుండు' అన్నది నిజమో కాదో గానీ, తినగా తినగా గారెలు చేదుగా ఉంటాయి' అన్నది నిజ మన్పించింది.

హోటలు భోజనంలో నాల్గు రకాల పదార్థాలుంటాయి. కానీ మూడు రోజులు తినేసరికే మొహం మొత్తుతుంది. ఎందుకంటే ఆ ఆహార పద్ధతిలో వైవిధ్యంలేదు. అంతేకాదు. రుచులలోనూ మార్పుండదు. కనుకే ఏ ఒక్కజాతి తమ తమ పాత పద్ధతుల ప్రకారం చేస్తే వైవిధ్యం ఉండదు. కనుక కాస్త వీలయినంత మేరకు ఇత రులనుండి వంటకాలు నేర్చుకు అనుసరించాలి.

ఆరోజు మా జానకిని చూడటానికి వెళ్ళాను. జానకి ఆఖరి కొడుకు డైనింగు టేబిలు దగ్గర కూర్చుని తింటున్నాడు. కంచంలో రెండు సాండ్ విచ్‌లు, రెండు పుల్కాలు, చిన్న గిన్నెలో ఉడి కించిన టొమాటో ముక్కలు, కారెట్టు ముక్కలు, నిమ్మకాయరసం ఒక చిన్న కటోరీలో పెరుగూ, అరటిపండూ ఉన్నాయి. నాకాశ్చర్యం వేసింది. మా వాడు అన్నీ అమర్చి పెట్టితేనే ముద్దని మింగక బాధ పెడ్తాడు. అలాంటిది ఆ అబ్బాయి తిండి చూసి ఆశ్చర్యపోయాను.

జానకిని చూసి, ''పిల్లలంతా కులాసాగా ఉన్నారా' అని అడిగాను.

''ఆ! పెద్దది మాంచెస్టరునుంచి వ్రాసింది. పెద్దవాడు కాలిఫోర్నియానుంచి, రెండోవాడు చండీఘర్‌నుంచీ వ్రాసారు. రెండోదాని మొగుడికి జమ్మూ అయింది. వెళ్ళింది. ఇక్కడ వీడు అందరూ కులాసాగానే ఉన్నారు'' అంది.

''అందరూ ఎంతెంత దూరాల్లో ఉన్నారు?'' అన్నాను.

జానకి చెప్పింది ''కొంచెం మందికి దూరదేశాలు వెళ్ళి ఉండటం అంటే సరిపడదు. దేశాల మాట అటుంచు. ఢిల్లీ కెళ్ళి వారం తిరిగే సరికినా పెద్ద మేనల్లుడు తిరిగి వచ్చేసాడు తిండి సరిపడలేదని పిల్లలు ఇలాగ ఉండటానికి మనమే భాధ్యులం ఒకవిధంగా. మనం వాళ్ళని కొంగు వెనకే త్రిప్పుకుని నాలుకకి రుచిగా పూర్తిగా మన ఆహార పద్ధతులతోటే పెట్టి పెంచుతాం. దానితో బయట వూరికి వెళ్ళి తిండి కుదరలేదని వచ్చేస్తారు. ఇప్పుడు శీను తినేది చూసావా. నేను మన వంటలేకాక వారానికి ఒకసారైనా కనీసం ఇలాంటి భోజనము పెట్తాను. పత్రికల్లో అవీ చదివినవి, చేసిచూస్తాను. అందుకే నా పిల్లలు ఎవరూ కూడా భోజనం సరిపడ లేదని వెళ్ళిన పూర్వమునుండి తిరిగి రాలేదు'' అంది గర్వంగా.

## రచయిత్రి గురించి

భర్త ఉద్యోగరీత్యా ప్రస్తుతం కలకత్తాలో వుంటూన్న రచయిత్రి విద్యాభ్యాసం మద్రాసులో జరిగింది కెమిస్ట్రీలో యం. ఎస్. సి. పట్టభద్రురాలైన యీమెకు యిద్దరు [3 సం॥లు, 1 సం॥] కుమారులు. బయోకెమిస్ట్రీలో పి హెచ్. డీ చేద్దామనుకున్న యీమె; భర్త ఉద్యోగరీత్యా కలకత్తా వెళ్లారు. చిన్ననాటినుంచి రచన వ్యాసాంగంలో ప్రవేశం. అడపా తడపా వక్తృత్వ వ్యాసాంగాల లోను, విద్యాభ్యాసంలోను కూడా బహుమతులను పొందేవారు. ''ఇలాగే కలం పేరుతోనే వ్యవహరింపబడాలని నా కోరిక'' అంటూ రచయిత్రి కోరటం చేత ఆమె అసలు నామధేయం, ఇవ్వటం లేదు!

దీనిలో కొంచెం నిజం లేకపోలేదు. ఆవకాయ లేందేనూ, పప్పు లేనిదేనూ ముద్ద దిగని వారున్నారు. అందుకే జానకి చెప్పినది నాకు సమంజసంగానే కన్పడింది.

కాని అంత మాత్రానికి పూర్తిగా ఇతర ప్రాంతాలవారి పద్ధతులుగాని పాశ్చాత్యుల పద్ధతులు గానీ అనుసరించడానికి కుదరదు. పాశ్చాత్యులని అనుసరించడం అసలే కుదరదు. ఎంత క్వాలిటీ అనీ, మొకాంబోఅనీ, ట్రింకాస్‌అనీ రెస్టరాంట్లు ఇష్టం గా తినేవారికైనా ఒకరోజు రెండు రోజులు అక్కడ తినాలని అన్పిస్తుందిగానీ రోజూ అలా వేరేవారి పద్ధతులలో వండిన ఆహారాన్ని తినాలని అనిపించదు. తరతరాలుగా మన రక్తంలో జీర్ణించుకుపోయిన మన ఆహార పద్ధతులు వదిలిపెట్టి వేరే జాతులవారి పద్ధతులు అనుసరించలేరము. అనుసరించాల్సిన అవసరమూలేదు. కానీ బొత్తిగా మన పద్ధతిలో ఉంటేనే ముద్ద మింగుడు పడుతుందన్నట్లుగాకాక, ఏ పద్ధతినైనా అవలంబించ గలమని ఉండాలి. ఎవరి రుచులు వారివే గనుక అంత మాత్రాన మన వంటలపై మోజు మనకి తగ్గదుకదా! గుత్తివంకాయ కూరా, గోంగూర పచ్చడి, ఆవకాయ, చేగోడీలు మొదలైన స్వదేశీ పిండివంటలు, పేరు చెప్తేనే లాలాజలం వూరుతుందే! అలాంటి వాటిని త్యజించి వేరే పద్ధతులని అనుసరించడం ఎందుకు?

## ''ఎప్పటికయ్యది ప్రస్తుతము.....''

కానీ, బీ రైక్ ఏ రోమన్ ఇన్ రోమ్ (రోములో రోమనులాగుండు) అన్న దాని ప్రకారం ఏ ప్రదేశానికి వెళ్ళితే అక్కడి ఆహార పద్ధతులు అలవాటు పడితే ఏ బాధ ఉండదు. ఇది మాత్రం చాలా అవశ్యం. సముద్రంపై ప్రయాణంచేసి వెళ్ళి దూర దేశానికి చింతపండూ, ఆవకాయ పొస్టులో తెప్పించుకోక అక్కడే దొరికే వాటితోనే సర్దుకుపోవటంలోనే ఉంది మన గొప్పతనం. ఆ యా ప్రదేశాల శీతోష్ణస్థితికి అనుగుణంగా ఆ యా జాతులవారి ఆహార పద్ధతులు ఏర్పడి ఉంటాయి. కనుక మనం ఎక్కడికి వెళ్ళితే అక్కడివారు తినే సరుకులనే మనకి సయించిన వాటిని వండుకు తినడం మంచిది.

తెలివైన గృహిణి వంటనో శ్రమగా భావించక మన ఆహారంలోనూ, చాకచక్యంతో అనేక వెరైటీలుచేసి పెట్టగలదు. పాశ్చాత్యులనిగానీ ఇతర జాతులనిగానీ పూర్తిగా అనుసరించాల్సిన అవసరం లేదు. కానీ ఏదైనా కొన్ని వంటకాలు మనకి నచ్చుతాయని తోచితో చేయడం మంచిదే. అంత మాత్రాన పూర్తిగా వారి పద్ధతులని అనుసరించ నక్కరలేదు. శాకాహార మాంసాహార అన్నదానిని బట్టి, ఎవరి ఎవరి ఆర్థిక స్థితిగతులనిబట్టి, వారి వారి రుచుల కనుగుణంగా పుష్టికరమైన ఆహారమే ముఖ్యం. అంతేగాని వెర్రిగా ఇతరులని అనుసరించాడల్సిన పనిలేదు.

కుటుంబంలోని వారి రుచులకి అనుగుణంగా తన చాకచక్యంతో ఆహార పద్ధతులలో వైవిధ్యాన్ని చూపుతూ, బలమైన ఆహారాన్ని రుచిగా శ్రద్ధతో వండిపెట్టగలిగిన యువతి మన ఆధునిక యువతి.

★

# వనితా వాణి

## ఉత్తరాది ఆంధ్రులు

నేను ఈ వారం (15—5—64) పత్రిక చదివాను. వనితాలోకంలో ప్రచురించిన 'ఉత్తరాదిలో ఆంధ్రులు' వ్యాసం చదివి ఈ ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. రచయిత్రి ఈ మధ్యనే ఆ ప్రాంతానికి వెళ్ళటం వలన చాలా అనుభవం తక్కువగా ఉన్నట్లు వ్రాసింది. మన తెలుగువాళ్ళు ఎక్కడ కనిపిస్తారా అని ప్రతి తెలుగువారూ ఎదురు చూస్తూంటారు. అటువంటి సందర్భంలో తెలుగు పిల్ల హిందీలో జవాబు ఇచ్చింది అనటంలో అర్థం లేదు. అయితే తెలుగువారు కూడా (కాలేజీ పిల్లలు) హిందీలో మాట్లాడుకున్నారు అని నేరం ఆరోపించటం తప్పు. కాలేజీ అన్న తరువాత వివిధ భాషలవారు కలుస్తారు. వాళ్ళు కామన్‌గా మాట్లాడుకునేది హిందీకాని, ఆంగ్లముకాని అయి ఉండవచ్చు. ఆ అలవాటు చొప్పున ఇంటి దగ్గర కూడా మాట్లాడుతారు. ఈ విషయంలో వేలెత్తి చూపటం అనవసరం.

పోగా ఆంధ్రా సమితి అని ఉండదు అని రచయిత్రి పేర్కొన్నారు. బహుశా ఇంకా వారువుంటున్న వూళ్లో ఇంకా సమితి వగైరా ఎక్కడ ఉన్నది తెలియక పోవచ్చు. కాని ఉత్తరాదిలో మన 'ఆంధ్రా అసోసియేషన్స్' కూడా తప్పకుండా నడుపబడుతూ ఉంటయ్. పైగా తెలుగు పిక్చర్స్ కూడా ఒక్కొక్క 'షో' చొప్పున చొప్పున వేస్తూంటారు. ఒక్కొక్క సమయంలో ఈ 'ఆంధ్రా అసోసియేషన్' వారు ఆ తెలుగు పిక్చరుతోపాటు అందు నటించిన నటీనటులను పిలి పించి సన్మానించటం కూడా జరుగుతుంటుంది. ఉత్తరాదిలో ఉన్న ఆంధ్రులను గూర్చి రచయిత్రి కలిగి ఉన్న అపోహను ఇప్పటికైనా మార్చుకోగలరను కుంటాను. గత పదిహేనేండ్లుగా ఉత్తరాదిని గూర్చి ఉన్న అనుభవం వల్ల నేనీ లేఖ వ్రాయగల్గుతున్నాను.

మిస్. అందుకూరి బుర్ర పుష్పమ్మ,
(విదుద్రోలు)

## నేటి యువతీ యువకుల వివాహ వ్యవస్థ

బాహ్య సౌందర్యాన్ని చూచి వరించటమే 'ప్రేమ' యని చాలామంది యువతీ యువకుల అభిప్రాయము. వీరికి ఆశయాలు, ఆదర్శాలు, అభిరుచుల ప్రసక్తి లేదు. రచయిత్రిగారు వ్రాసినట్లు వివాహానికి పూర్వం ఒకరినొకరు అర్థం చేసుకునే అవకాశాలు, చాలా తక్కువ. వ్యాసంలో 'జానకి' చెప్పి నట్లు వ్యక్తులు పూర్తిగా మారి ఆదర్శంగా తయారు కావాలి. దీనికి పెద్దవారి సానుభూతి, సహకారాలు అవ సరం. లేకపోతే కలతలు ఉన్న సంసారంకంటే నరకమే నయమనిపిస్తుంది.

ఉషారాణి చంద్రర్ (హనుమకొండ)

* * *

నేటి యువతీ యువకుల మనస్తత్వాలను తమ వ్యాసంలో తెలుపగలిగారు. వ్యాసం చివరి ముగింపు వాక్యాలు చక్కని దాంపత్య జీవితానికి సోపానములని చెప్పకతప్పదు. "తెలుగు సినిమాలో హాస్యగాడిలా, భార్య కొంగు వెనకాల పిల్లిమొగ్గలేసే మొగవాడిని భరించటమూ అంతే కష్టమవుతుంది". ఈ వాక్యం మూడ గనే నవ్వు ఆగిందికాదు. కాని అటువంటి యువకు లున్నారనుటకు సందేహం లేదు. నేను కళ్ళారా చూస్తున్నాను. ఈ వ్యాసం నేటి సాంఘిక స్థితికి చాలా దగ్గరగా ఉంది.

బి. వి. లక్ష్మినారాయణ (గుంటూరు)

* * *

వివాహం అంటే ఏంటో చక్కగా నిర్వచించారు. ఈ కాలంలో అన్నిరకాల వివాహాలు ఒకేమాదిరిగా ఉన్నా ప్రతి సంసారంలో భార్యాభర్తల మధ్య ఏదో ఒక విధంగా అపార్థాలు వస్తున్నాయి. వివాహానంతరం స్త్రీ ఎన్నిటికి గురి అవుతుందో దానిలోని కష్టాన్ని చక్కగా తీర్చిదిద్దారు. ఈ విషయంలో వారితో నేనుకూడా ఏకీభవిస్తాను.

కుమారి బి. సరస్వతి (విశాఖపట్టణం)

* * *

జానకి తెలుపదలంచిన భావాల్లో ప్రతి అమ్మాయి లోనూ ఏవో కొన్ని తప్పనిసరిగా ఉంటూ ఉన్నాయి.

...నరనారీ జనులంతా ఒకటేనని చాటినా ప్రకృతి సహజంగా వస్తున్న కొన్ని భేదాలవల్ల— భిన్నత్వం ఉంటుంది. పరస్పరం "జీవితపు విలువలు" మాత్రం ఇరువురికి సమానమే. యువతీ యువకు లిరువురిలో మార్పులు సమానంగా వచ్చిననాడే, పరస్పరం—సంకు చిత్వం వీడనాడి, ఆత్మవిశ్వాసం ఏర్పరుచుకొనటం జరుగుతుంది.

మేమూ ఈ విషయాలు చర్చించుకుంటూ ఉంటాము. ఒకసారి మా మిత్రురాలు "నాజీవి తంలో ఎటువంటి వ్యక్తి వచ్చినా నేను సుఖపడ గలను. అయినా సుఖపడటమనేది మనం చేసుకోవ టంలో ఉంది" అన్నది దృఢంగా. నేనెంతగానో ఆశ్చర్య పోయా. 'అబ్బ! ఏదీ లేకుండా — ముందుగానే ఎంత ఆత్మవిశ్వాసం ఏర్పరచుకున్నావ్!' అని. అదే అన్నాను తనతో......

చదువు పూర్తయితేనేగాని వివాహం చేసుకోనన్న అమ్మాయి చదువుతూండగానే వివాహం చేసేసు కుంటుంది, ఇందులో కొంత ప్రేమ వ్యవహారం ఉంది. ఎక్కువగా అబ్బాయి విషయంలో........

తెలుగు అమ్మాయి తల్లిదండ్రుల్ని ఒప్పించి, పెద్ద కట్నం ఇచ్చి చేస్తామన్న అమ్మాయిని తండ్రి చేసుకోమన్నా వలదని (పైగా కట్నం తీసుకొనని తండ్రితో పేచీకూడా) స్పర్ధతో గెలిచి, "నువ్వు చేసుకోనకపోతే భగ్న హృదయుణ్ని అయిపోతాను. సుమా—" అన్నట్లు స్నేహితులతో చెప్పించి—, ఒప్పించి మాటలని లాక్కుపోతున్నాడు ఆ అబ్బాయి. ఈ నెలలోనే వివాహం.

అనవసరపు సాగటానికి మాత్రం ఏంఅటుకంలేదట!

"....అతడు రెండు సంవత్సరాలనుంచి తెలుసు. సహృదయుడు. మంచి సంస్కారి...... వన్ను సుఖ పెడతాడనే నమ్మకం ఉంది....మరి మా పెళ్ళికి నువ్వు తప్పక రావాలి సుమా, చెలీ" అని ఒక అంద మైన వర్తమానం పంపించింది. నాకు.

కుమారి అనంట కృష్ణవేణి (పేరవరం) ★

# వాటర్‌బరీస్ కాంపౌండ్

లేబిలు

## త్రాగి దగ్గును ఎదుర్కోండి








విడవకుండా వచ్చే దగ్గు మీలోని రోగమును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుతుంది, దేహమును బలహీనపరచి రోగములు కలిగే అవకాశమును కలిగిస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్ మూడు విధములుగా పనిచేస్తుంది: దానిలోని క్రియోసోట్ మరియు గయెకోల్ దగ్గునుండి ఉపశమనము కలిగించును. దానిలో చేరే ఇనుముయొక్క సత్తువ, బలవర్ధక పదార్థములు, మాల్ట్, ప్లీహ సారములు ఆకలిని పుట్టించును, కోల్పోయిన శక్తిని భర్తీచేయును, రోగము మళ్లీ రాకుండా ఉండేలా రోగనిరోధక శక్తిని కలిగించును.

ఏ శీతోష్ణస్థితిలోనైనా రోగనిరోధక శక్తికి ఎట్టి లేబిలుగల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి.



వాటర్‌బరీస్ కాంపౌండ్‌లోగల క్రియోసోట్ మరియు గయెకోల్ కఫమును విడతీసి ఉమ్మిలో పోయేలాచేయును మరియు పుళ్లటను అడ్డును. అవి ఊపిరితిత్తులను శుభ్రపరచును, దగ్గు, జలుబు, ఉబ్బసపు అసౌఖ్యము, శ్వాసనాళపు అస్వస్థతలను పోగొట్టుటలో సహకరించును మరియు రోగములు మళ్లీ రాకుండా చేయును.

# వాటర్‌బరీస్ కాంపౌండ్

**దగ్గు, జలుబు, శ్వాసనాళపు అస్వస్థతలు, ఉబ్బసపు అసౌఖ్యములను నివారించుటకు శక్తిని కలిగించును**

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో సంస్థాపితము) JWT.WL.

# వియత్నాం వింతలు విశేషాలు!



సైగాన్‌లోని ముఖ్యమైన
బౌద్ధ ఆలయాల్లో ఇదీ ఒకటి.

ఆకెళ్ల సీతాదేవి

వియత్ నామ్ దేశం మొదట్లో ఫ్రెంచి ప్రభుత్వము అజమాయిషీలో ఉండేది.

1954 సం॥రం జినీవా ఒడంబడికలో దేశం. మనదేశంలాగా రెండుగా విడిపోయింది. దక్షిణ వియత్‌నాముకు 'సైగాన్' ముఖ్యపట్టణం. ఉత్తర వియత్‌నాముకు ముఖ్యపట్టణం 'హెనాయి'. దేశ విభజనకు ముందు అనాదిగా వస్తున్న 'హెనాయి' దేశమంతకూ ముఖ్యపట్టణము. దక్షిణ వియత్‌నామ్ స్వేచ్ఛా స్వతంత్ర రాజ్య కూటమికి అనుకూలంగా ఉంటోంది. ఉత్తరఖండం కమ్యూనిస్టు ఆధ్వర్యంలో ఉంటూంది. రెండు రిపబ్లిక్కులే. దక్షిణం జనాభా 14 మిలియన్లు. ఉత్తరాది జనాభా 16 మిల్లియను. జాతీయంగా 90 వంతులు వీత్ నామిసే. దక్షిణ వియత్‌నాములో మిగలా వారిలో చాలా భాగం చైనీయులు. వారంతా వీత్‌నామ్ జాతీయత పొందినవారే. అయితే కొన్నివేల హిందూవులు, ముసల్మానులు కూడా వ్యాపారాలు చేసుకుంటూన్నారు.

దక్షిణ వియత్‌నాము చాలాసారవంతమైన మీకాంగు డెల్టా భూమి. బంగారంలాటి పాడిపంటలు ఉన్నాయి. రెండు రాష్ట్రాల మధ్య వైషమ్యాలు, యుద్ధాలు జరుగుచున్నా విశేషముగా వరిపంట, అన్నిరకాల పళ్లు కూరగాయలూ పండుతాయి. ఇదిగాక, రబ్బరు, నార పండుతాయి. వరి, రబ్బరు, నార, గోని, ఎగుమతులవల్ల ఆర్థికంగా ఎగుమతులకు తోడ్పడుచున్నాయి. ఇప్పుడిప్పుడు పారిశ్రామికాభివృద్ధికి పునాదులు పడుచున్నాయి. అయితే, సైగాను ముఖ్యపట్టణం చాలా హృదయరమ్యంగా విరాజిల్లుతూ ఉంటుంది. 'సైగాన్ యిప్పటికీ "తూర్పు దేశాల ప్యారిస్"గా చలామణీ అగుచుండడంలో ఆశ్చర్యంలేదు. సైగాన్ జనాభా సుమారుగా 3 మిలియన్లు. సుమారుగా దేశంలో 5వ వంతు జనాభా 'సైగాన్'లోనే ఉన్నది. వీరి భాష 'వియతనామీస్'. దీని లిపి రోమన్ లిపి. అయితే, ఉచ్చారణ క్రమంవేరు. ఇచ్చటి వాతావరణం సాధారణంగా మద్రాసు వాతావరణంలా ఉంటుంది. అంటే చలికాలం అనేది లేదు. ఎప్పుడూ ఎండలు, వానలూ, వాతావరణానికి అనుకూలం నూలు బట్టలే. కాని, ఫ్రెంచి సంప్రదాయలననుసరించి అక్కడ, సాధారణంగా పట్నాలలో ఉన్నవారు 'టెరిలిన్' 'నైలాన్' 'డెకరాన్', 'టెరగాన్' మొదలైన వాటితో పాశ్చాత్య పద్ధతిలో దుస్తులు ధరించుతూ ఉంటారు. ఇక స్త్రీలు చాలా పచ్చగాను, సున్నితంగాను, సౌకుమార్యంగానూ ఉంటారు. వీరు చక్కని సిల్కు పైజమాలు, పైన నైలాన్, డెకరాన్ మొదలయిన సున్నితముగా ఉండే పొడుగు గౌనులు వేసుకుంటారు. ఆ గౌనులు మెడనుండి నడుము వద్ద వీరి నడుచుటకు అనుకూలంగా ఉంటాయి. సన్నని నడుములు మృదువైన శరీరం, అలంకరణంతా పాశ్చాత్య పద్ధతుల మీద ఉంటుంది. పెద్ద తల కట్టులున్నా యిప్పటి పిల్లలంతా జుట్టు కత్తిరించి 'బాబ్' చేయించుదురు.

వియత్నామీలు పచ్చగా చైనీయులను పోలి ఉంటారు. అయితే, అక్కడ నిరక్షరాస్యత లేదని చెప్పవచ్చు. నిశానీ పద్దులు ఉండవు. అందరూ వారిపేర్లు సంతకం చేయగలవారే. వీరు సహజంగా స్నేహ ప్రాత్రులు. పరోపకారస్తులు. వీరికి పెద్దలన్న గౌరవం మెండు. అయితే వీరు వారంత వారు ముందుకు చొచ్చుకుని ప్రవర్తించే స్వభాంవంలేని వారు. వారిని పలుకరించిన తరువాతనే వారు స్నేహాభిమానములు చూపుతారు. వీరు బౌద్ధమతావలంబీకులు. వినయంగా మాట్లాడుతారు. పట్టణాలలో వారి భాష తరువాత, ఫ్రెంచి, ఇప్పుడిప్పుడు ఇంగ్లీషు మాట్లాడుతూంటారు.

సైగాన్‌లో 5 వేల చిన్న టాక్సీలు తిరుగుతూంటాయి. ఏ దేశంలోనూ, 'టాక్సీ' సౌఖ్యం యిక్కడ ఉన్నట్టు ఉండదు. మన ఆంధ్రదేశంలో 'రిక్షా'ల్లాగ ఉంటాయి. మనకి ఎక్కడ పడితే అక్కడ లభ్యం అవుతూంటాయి. చాల చౌక అనే చెప్పాలి. అందుకే అంత విరివిగా వాడకంలో ఉంటాయి. అక్కడ ఆడవారి సంఖ్య మొగవారి సంఖ్యకు మూడురెట్లు ఉంటుంది. యుద్ధాల కారణంవల్ల జననష్టం దీనికి ముఖ్యకారణం అవచ్చును. రెండు మూడు పెళ్లిళ్లు అక్కడ ఆశ్చర్యంకాదు. సంతాన నిరోధం ఏమీ ఉన్నట్టు కనబడదు. ఎన్ని కాన్పులు వచ్చినా, స్త్రీలు సహజ సౌందర్యం కోల్పోక చిన్నపిల్లలాగే 'మేకప్'లో ఉంటారు. అంతమంది పిల్లల తల్లి అని మనకి తెలియదు. అన్ని వృత్తి వ్యాపారాలలోను పురుషులకన్నా స్త్రీలు ఎక్కువగా ఉంటారు. పురుషులకన్నా వీరు ఎక్కువ శ్రద్ధతోను, చాకచక్యంగాను నడుపుతూంటారు.

వియత్‌నామీయులకు, ముఖ్యంగా పట్టణాసులలో స్త్రీ పురుషులు, వేషభాషలమీద ఎక్కువ ఖర్చు పెట్టుదారు. సెంటులు, పెర్‌ఫ్యూమ్‌లు, పౌడర్లు, లిప్‌స్టిక్‌లు, నాజూకైన, అందమైన రంగురంగుల దుస్తులలో తిరుగుతూంటారు. అచ్చటి స్త్రీలు మేలిమి బంగారు వస్తువులేగాని, మనదేశంలో



ఒకానొక హోటలులో 'డిన్నర్' జరుగుతున్న చిత్రం. విందు సమయాల్లో సంగీత కాలక్షేపం కూడా జరగటం ఇక్కడి సంప్రదాయం.



పార్లమెంటు సమావేశాలు జరిగే అసెంబ్లీహాలు దృశ్యం. ఈ భవనాన్ని ఫ్రెంచి నిర్మాణపు రీతులను అధారంచేసికొని నిర్మించారు.



ఫ్రెంచి పద్ధతులలో నిర్మించబడిన సైగాన్ మార్కెట్టు. ఇక్కడి చిన్న గుండు సూది మొదలూ ఎంతో విలువైన వస్తువులవరకు లభిస్తాయి.

లోలాగ కాను బంగారాలు వాడరు. ప్రతివారికీ 'వాచీ' ఒక ముఖ్యమైన ఆభరణం. ఏదో సన్నని గొలుసు, పల్చని రెండు జతల గాజులు తప్ప ఎక్కువ బంగారు ఆభరణాలు ధరించరు. ఇప్పటి పిల్లలు, సైకిలు త్రొక్కుట ఒక సర్వ సామాన్యమైన పని. ఆడవాళ్ళు ఎక్కువ ఆటో సైకిల్సు, స్కూటర్లు, కార్లు వాడతారు.

మనకూ వీరికి ముఖ్యముగా గమనింపతగ్గ విషయం ఏమిటనగా— వారికి 'రేపు' ఎట్లా గడుచును అన్న విషయం అనుకోరు. చేతిలో డబ్బు ఉన్నప్పుడే 'పండుగ' అనే స్థితిలో ఉంటారు. దీనికి అనుగుణంగా పట్నం నిండా రెస్టారెంటులు, నైటు క్లబ్బులూ, డాన్సింగుహాల్సు, సినిమాలూ. వీటిలో టిక్కట్లు అమ్మేవాళ్ళు, రెస్టారెంటులలో సెర్వర్సు, నైటు క్లబ్బులో అంతా ఆడపిల్లలే ఉంటారు. అక్కడ మధ్యపాన నిషేధం లేదు. అక్కడ అంతా 'బీరు' త్రాగుతారు. అక్కడ తెల్లవారగట్ల రెండు గంటల వరకూ నైటు క్లబ్బులు తెరిచిఉంటాయి. భోజన సదుపాయం అంతవరకూ లభిస్తుంది గూడాను. వీయతనామీయులు మామూలుగా తినే భోజనం ఒకటి రెండు కప్పులలో మాంసమిళితమైన జావ రూపంలో ఉంటుంది. అది చేతులతో కాక రెండు పుల్లలతో అతి చాకచక్యంగా తీసుకుని తింటారు. వాళ్ళు చైనా, జపాను దేశస్థులవలె చేపలే కాక, ఇతర మిడుత, కప్ప మొదలగు సమస్త పదార్థాలు తింటారు. మనలో శాఖాహారులకు కొంచెం ఏవగింపుగానే ఉంటుంది. రెస్టారెంటులలో భోజనం ఫ్రెంచి, చైనాదేశ వంటకాలలో చాలా రుచిగా ఉంటుందని అంతా పొగుడుతూ ఉంటారు ఇక్కడ భోజనానికి సుమారు 10 రూ. మొదలు 25 రూ వరకు అవడంలో ఆశ్చర్యంలేదు. తరుచు ఇలా ఖర్చుపెట్టటానికి వీలుపడదు కాబట్టి మిగతా రోజులలో, సామాన్య కుటుంబాలు గూడా సాయంకాలం భోజనానంతరం ఏ పార్కుకో, సైగాన్ నది ఒడ్డున రమ్యంగా పార్కులా వేసిన ఆవరణలలో సకుటుంబంగా వచ్చి అక్కడ చెరుకు ముక్కలు, అనాసపండు ముక్కలు, వేరుశనగ పప్పు మొదలగువాటిని పిల్లలకు కొనిపెట్టి రెండు మూడు గంటలు చల్లగాలిలో కూర్చుని ఇళ్ళకు వెడుతూంటారు. వారి ఇళ్ళు చాలా గమ్మత్తుగా ఉంటాయి. అందరూ బంగళాలలో ఉండలేరు గదా! అక్కడ పూరిళ్ళ లోనేనా రంగు కాగితాలతోటి, బల్ల చెక్కలతోటి కట్టిన ఇళ్ళలో ఉంటూంటారు. ఎవరూ క్రింద కూచుని తినే అలవాట్లులేవు భోజనానికి ఒక మేజా బల్ల, ఆబల్ల మీద ప్లాస్టిక్ గుడ్డ, దానిమీద భోజనపదార్థాలు పెట్టుకుని పాశ్చాత్య పద్ధతిలో భోజనం చేస్తారు. ఏమీ లేనివాడు ఇంటికి వెళ్లినా పడుకొనుటకు ఒక పెద్ద మంచం, దానిమీద పరుపు, సామాన్లు పెట్టుకోడానికి ఒక బీరువా, భోజనం చేయడానికి టేబిల్, కుర్చీలు—ఉంటాయి. గాజు గ్లాసులు, పింగాణి కంచాలు, గిన్నెలు, ప్లేటులూ ఉంటాయి. వంటకాలు కుంపట్లమీద గాని, పొయ్యిమీద గాని చేస్తారు. ప్రతివాళ్లు 'టీ' గాని, 'కాఫీ' గాని త్రాగుతారు. ఆ త్రాగేది ట్రేలో పెట్టి తెచ్చుకొని బల్లమీద పెట్టుకునే త్రాగుతారు. ఇవే వాళ్ల సంసార సామగ్రి. ఒక కర్రపెట్టి, పైన రంగు కాగి

45వ పేజీ చూడండి



సైగాన్ మ్యూజియం ప్రవేశద్వారం. 'చైనా పగోడా'లను అనుకరించి, దీనిని నిర్మించారని ప్రతీతి.

**19-6-1964 శుక్రవారము మొదలు**
**25-6-1964 గురువారము వరకు**

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం కూడా మొత్తంమీద బాగానే ఉంటుంది. వ్యాపారంలో మామూలుగా జరుగవలసిన పనులకు కూడా కొన్ని ఆటంకాలు వస్తాయికాని వాటివల్ల మీకు నష్టం కలుగదు. సాహసముతో కూడిన వ్యాపారం లాభించవచ్చును. వృత్తి ఉద్యోగాల్లో ఆదాయం పెరగదుగాని అనుకూలత పలుకుబడి లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందక కొంత ఇబ్బంది కలుగుతుంది. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుందిగాని వారం మధ్యలో మానసికాందోళన కలగవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావచ్చును. దైవ కార్యాలు నిరాటంకంగా నెరవేరతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు. అలంకార వస్తువులు కొంటారు.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

అందరూ సలహాలు చెప్పేవారేకాని సహాయం చేసేవారు ఒకరూ ఉండరు. ఇతరుల మాటలను నమ్మి యే వ్యవహారమూ ప్రారంభించడం మంచిది కాదు. వారాంతంలో వ్యాపారంలో ధన నష్టం రాగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనకూలంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాలు సాధారణంగా ఉంటాయి. సమయానికి ఏదో ఒక డబ్బు అందడంవలన మొత్తంమీద పరిస్థితి సంతృప్తికరంగా నే ఉంటుంది. ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో పలుకుబడి అధికుల పరిచయం లభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వ్యాపారంలో కొన్ని వ్యవహారాలు ఆకస్మికంగా మీకు అనుకూలంగా మారి లాభించవచ్చును. అధికారులవలన కావలసిన పనులు అనాయాసంగా నెరవేరుతాయి. వ్యాపారంలో ఆదాయంతోపాటు అంతస్తు కూడా పెరుగుతుంది. వృత్తిలో ప్రయోజనంగల శ్రమ పెరగవచ్చును. ఉద్యోగంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మీరు చేయవలసిన ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి తగిన సమయం. కోర్టు వ్యవహారాల్లో ఉన్న వ్యతిరేకత తొలగిపోతుంది. ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయ

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | శు బు | శు రా ర |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | |
| కే | | | చం |

తగదు. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో బుద్ధి చురుకుగా పని చేస్తుంది. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది. స్త్రీలకు— స్వల్ప అనారోగ్య సూచనలు ఉన్నాయి. కుటుంబంలో కార్య భారం పెరుగుతుంది. వినోద కార్యక్రమాలో పాల్గొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. బంధువుల కార్యభారాన్ని వహిస్తారు. శుభ మూలంగా ధన వ్యయం చేస్తారు.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

తానొకటి తలిస్తే దైవమొకటి తలచును అదే పామెత మీ విషయంలో అక్షరాలా జరుగుతుంది. వ్యాపారంలో నష్టం రాకపోయినా ప్రయత్నించిన వ్యవహారాలు సంతృప్తికరంగా నెరవేరవు. వ్యాపార విషయాల్లో కలహ ప్రసంగం కూడా వచ్చే సూచనలు ఉన్నాయి. సాధ్యమైనంత వరకు అన్ని విషయాల్లోను తటస్థంగా ఉండటం మంచిది. వృత్తి ఉద్యోగాలు సామాన్యంగా ఉంటాయి. మీపై అధికారులతో అభిప్రాయ భేదాలు రావచ్చును. మిగిలిన వ్యవహారాలు యెలాగ ఉన్నా ఆర్థికంగా ఇబ్బంది ఉండదు. స్వల్ప అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. సంతానానికి సౌఖ్యం సంతోషం లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు. విలువైన వస్తువులు కొంటారు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం కూడా బాగానే ఉంటుంది. వ్యాపారంలో అన్ని పనులూ సక్రమంగా నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లభించవచ్చును. మీ అభిప్రాయాలు ఆలోచనలు మీకే కాకుండా మీ స్నేహితులకు కూడా లాభకరంగా ఉంటాయి. ఆదాయం పెరుగుటకు అవకాశం ఉన్నది. వృత్తి ఉద్యోగాలు సంతృప్తికరంగా ఉంటాయి. మీరు ఇదివరకు ప్రయత్నించిన పనులు వారాంతంలో వాటంతట అవే నెరవేరుతాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన పరిణామాలు రావచ్చును. ఆరోగ్యం గత వారంకంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యధాతధంగా

> **ఈ వారము ధరలు**
>
> ధాన్యం ధర స్వల్పంగాపెరిగి నిలకడగా ఉంటుంది. అపరాధ ధరలో మాంద్యం ఏర్పడుతుంది. బెల్లంధర కొంచెం తగ్గవచ్చును. మిర్చిధరకూడా కొంచెం తగ్గుతుంది. నూనె, నువ్వుల ధరలో ఒడుదుడుకులు రావచ్చును.

ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో ధన వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. బంధువులకు సహాయం చేస్తారు.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

అన్ని వ్యవహారాలూ ఆర్భాటంగా ఉంటాయి గాని ఆర్థికంగా ప్రయోజనం అంతగా ఉండదు. మీకు యెక్కువ సంబంధం లేని వ్యవహారాల్లో మీరు చిక్కుకోవటం వల్ల మీ స్వంత వ్యవహారాలు సరిగా చూడలేని పరిస్థితి యేర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో పలుకుబడి పెరుగుతుంది. అందరూ మిమ్మల్ని గౌరవిస్తారు. ఉద్యోగంలో కూడా మన్నన లభిస్తుంది. మీరు ఇంతవరకు యెదురు చూస్తున్న మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఇతరుల వలన జరగ వలసిన పనుల నిమిత్తం ఈ వారం ప్రయత్నం చేయడం మంచిది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు జయ ప్రదంగా నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం విషయంలో జాగ్రత్త చాలా అవసరం. సాంఘిక కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి.

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

ఈ వారం మొత్తం మీద బాగానే ఉంటుంది. వ్యాపారంలో యేర్పడిన చిక్కులు క్రమంగా తగ్గుముఖం పడతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు కూడా సంతృప్తికరంగా ఉంటాయి. వృత్తికి సంబంధించిన మాతన విషయాలను తెల్సుకొంటారు. ఉద్యోగంలో ఇంతవరకు సాటి వారితో గల అభిప్రాయ భేదాలు తొలగిపోతాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉన్నా ఇంకా మనశ్శాంతి లభించదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. రాజకీయాలు బాగా ప్రోత్సాహకరంగా వుంటాయి. సత్పురుషుల సహవాసం లభిస్తుంది. ప్రేమవ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా బలహీనత చేస్తుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

అన్ని వ్యవహారాలూ అనుకూలంగా కన్పిస్తున్న

ప్పటికీ, యే మాత్రం యేమరుపాటు చూపినా నష్టం తప్పదు. వ్యాపారంలో విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి సమయం కాదు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు, భారీ ఎత్తున చేసే వ్యాపారాలు కొంత కాలం పాటు వాయిదా వేయడం మంచిది. వృత్తి ఉద్యోగాలు గతవారంలో వలెనే ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో ప్రతిపక్షం తాలూకు బలం పెరగగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. రక్త సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. సాంఘిక కార్యక్రమాలు జయప్రదంగా ఉంటాయి. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. బంధువుల కార్యభారాన్ని వహిస్తారు. శుభకార్యాల మూలంగా ధనవ్యయం చేస్తారు.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

గడచిన కొద్ది వారాల కంటె ఈ వారం బాగా ఉంటుంది. వ్యాపారంలో ఏర్పడిన అవరోధాలు తొలగిపోయి అనుకూలమైన మార్పులు కలుగుతాయి. వ్యాపార సంబంధమైన ముఖ్య నిర్ణయాలు చేయడానికి మంచి సమయం. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ఉన్న పోటీ తగ్గుతుంది. ఉద్యోగంలో అందరి మంచితనం లభిస్తుంది. మిత్రుల వ్యవహారాల్లో వ్యయప్రయాసలకు గురి కాగలరు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయకూడదు. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. రాజకీయాల్లో అకస్మాత్తుగా ఆందోళన కలిగించే పరిణామాలు ఏర్పడవచ్చును.

స్త్రీలకు—వారాంతంలో కొంచెం అనారోగ్యం చేయవచ్చును. కుటుంబంలో భేదాభిప్రాయాలు వస్తాయి. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది.

## మకరం :

(ఉ.షా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

ఈ వారం కూడా అంత బాగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. వ్యాపారంలో ఉన్నది నిలబెట్టుకొంటే చాలుననే పరిస్థితి ఏర్పడుతుంది. గాని మీ జాగరూకతవల్ల నష్టం రాకుండా తప్పించుకొంటారు. కొంతమంది స్నేహితులు సమయానికి సహాయం చేస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. వృత్తి ఉద్యోగాల్లో పెద్ద మార్పులు రావు. ఉద్యోగరీత్యా చేయవలసిన నిర్ణయాలు సాధ్యమైనంతవరకు వాయిదా వేయడం మంచిది. వారాంతంలో స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. శుభకార్యాల విషయంలో కొంచెం అభివృద్ధి ఉంటుంది. విద్యా విషయకమైన కృషి రాణిస్తుంది. ప్రేమ వ్యవహారాల్లో వ్యతిరేకత రావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1,2,3 పా.)

ఈ వారం బాగానే ఉంటుంది గాని విశేషమైన ఫలితాన్ని ఆశించడానికి అవకాశం తక్కువ. వ్యాపారంలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. భాగస్వాములతో కలిసి చేసే వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారులవలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరి లాభిస్తాయి. వృత్తి ఉద్యోగాల్లో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తిరీత్యా కొత్తవారితో పరిచయం ఏర్పడుతుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొన్ని భేదాభిప్రాయాలు రావచ్చును. సంతానానికి స్వల్ప అనారోగ్యం చేస్తుంది. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో చికాకులు వచ్చే సూచనలు ఉన్నాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు నిరాటంకంగా నెరవేరతాయి. బంధువులతో భేదాభిప్రాయాలు రావచ్చును. వారారంభంలో మానసికాందోళన.

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఈ వారాంతం నుంచి బాగా ఉంటుంది. ప్రయత్నము చేసిన ప్రతి పనీ నెరవేరుతుంది గాని, దాని నిమిత్తం చాలా శ్రమపడవలసి వస్తుంది. నూతన వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. వృత్తి ఉద్యోగాల్లో ముమ్ముందు ప్రయోజనం గల మార్పులు రావచ్చును. మీరు నమ్మిన వారే మోసం చేయగల ప్రమాదం ఉంది. ప్రతి వ్యవహారమూ సాధ్యమైనంతవరకు స్వయంగా చూడడం మంచిది. స్థిరాస్థి వ్యవహారాల్లో పెద్ద మార్పులు రావు. ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని, వారం మధ్యలో మానసికాందోళన కలగవచ్చును, రాజకీయాల్లో ఇంతవరకు ఉన్న ప్రతిఘటన తొలగిపోతుంది. ధైర్యంగా వ్యవహరించవలసిన సమయం.

స్త్రీలకు—ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. సాంఘిక కార్యక్రమాలు జయప్రదంగా ఉంటాయి. పలుకుబడి పెరుగుతుంది. ★

# జన్మదినఫలం

## జూన్-19

ఈ సంవత్సరం మీరు విశేషమైన యోగాన్ని పొందలేకపోయినా, మొత్తం మీద బాగా ఉంటుంది. వ్యాపారంలో ముమ్ముందు ఆర్థికంగా ప్రయోజనంగల మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది, అప్పుడప్పుడు కొద్దిగా ఇబ్బంది వచ్చినా సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు సర్దుబాటు అవుతుంది. వృత్తిలో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. ఉద్యోగంలో అధికారుల మన్నన లభిస్తుంది. స్థాన చలనమునకు సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో ఉన్న చిక్కులు ఇంకా తొలగక పోవచ్చును. బంధువుల కార్యాల్ని సాధించడంలో కొంత ధన వ్యయం జరుగుతుంది. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేస్తుంది. కుటుంబ పరిస్థితి యథాతథంగా ఉంటుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు. రాజకీయ నాయకులకు ఇంటర్వ్యూకు, మంచి సమయం. అక్టోబరు నవంబరు నెలల్లో ధన లాభం, సంతోషం.

## జూన్-20

ఈ సంవత్సరం ప్రారంభంలో అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వ్యాపారం ప్రోత్సాహకరంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యాపారాలు లభిస్తాయి, వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ఫలించవచ్చును. వృత్తిలో ఇంతవరకు ఉన్న పోటీ కాలక్రమేణ తగ్గి ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. కోర్టు వ్యవహారాల్లో కొంచెం వ్యతిరేకత కల్పించవచ్చును. డబ్బు ఇచ్చిపుచ్చుకోవడాల్లో తగాదాలు వస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి అనారోగ్యం చేయడం వలన ఆందోళన కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో సంవత్సరాంతంలో చిక్కులు రావచ్చును. రాజకీయాల్లో మీరు అనుకోని అనుకూలత లభిస్తుంది. మీ శక్తి సామర్థ్యాలు రుజువు చేసుకోవడంవలన ప్రతిపక్షాలవారు కూడా మిమ్మల్ని గౌరవిస్తారు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

## జూన్-21

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉంటుంది. కాని సంవత్సరాంతానికి అన్ని వ్యవహారాలు మీరు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. వ్యాపారంలో స్వల్పంగా ఆదాయం పెరగవచ్చును. తక్కువ స్థాయి వారితో జరిపే వ్యాపారాలు లాభిస్తాయి. అధికారులవలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. వృత్తిలో పెద్ద వారితో పరిచయం అభిస్తుంది, దానివలన ముమ్ముందు ప్రయోజనం ఉంటుంది. ఉద్యోగంలో ఉన్నత స్థానము లభించవచ్చును. భాగస్వాములతో కలిసి చేసే వ్యవహారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. ఆదాయం పెరిగినా అప్పుడప్పుడు డబ్బుకు ఇబ్బంది వస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొన్ని భేదాభిప్రాయాలు రావచ్చును, సాంఘిక కార్యక్రమాల్లో పలుకుబడి పెరుగుతుంది. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. పారిశ్రామికవేత్తలకు మంచి సమయం.

## జూన్-22

ఈ సంవత్సరం మీరు ఆమకొనేది
రంగ పేజీ చూడండి




ఆంధ్రదేశంలో ఒక జిల్లా ముఖ్య పట్టణంలో బస్‌స్టాండ్‌నుంచి కాలేజికి వెళ్ళేదారిలో సూర్య చంద్ర లారీ సర్వీసు షెడ్ ఉంది. సామాన్యంగా బస్‌స్టాండ్‌కీ, కాలేజికి మధ్య పయనించే ప్రజలు ఎంత తొందర పనిలోఉన్నా ఎంత పరధ్యానంగా నడుస్తున్నా ఆ సూర్య చంద్ర లారీ సర్వీసు దగ్గిరికి వచ్చేసరికి ఓ మారు ఉలిక్కిపడి చుట్టూచూసి ముందుకి సాగుతారు. దానికి కారణం లేకపోలేదు. మీదనించి లారీ వెళ్ళినా దులుపుకుని కదిలిపోయే ప్రొఫెసరునైనా విలవేయగల ఒక చిత్రమైన ధ్వని అక్కడ సంధ్యవేళలలో వినిపిస్తూంటూంది. ఇదీ అని స్పష్టంగా చెప్పలేంకాని డోలూ, సన్నాయీ బాంజో, మాండలిన్, గిటార్, పియానో ఒక్క మారు మోగిస్తే వచ్చే ధ్వనిని పోలిఉంటుంది అది. రాక్షసులు వసంతోత్సవాలలో తేలుతున్నారో, దేవతలు పమరోత్సాహంలో మునిగిఉన్నారోనని పథికులని అక్కజపరచే ఆ నాదం (ఆర్తనాదం కాదు) పుట్టు పూర్వోత్తరాలు అతి సామాన్య మైనవి.

మధ్యలో మొదలుపెట్టి వెనక్కి వెళ్ళడం మోడరన్ టెక్నిక్ కనక అసలు కథ ఇప్పుడు మొదలు పెడతాను (ఈమధ్య విద్యార్థులు కూడా ఇదే టెక్నిక్ అవలంబించి విరూపించవలసినది దత్తాంశంగా వ్రాస్తున్నారని పరీక్షాధికారులు గోల పెడుతున్నారు.) ఆ వూళ్ళో కాలేజిలో ఇంగ్లీషు డిపార్టుమెంటులోనూ, హిస్టరీ డిపార్టుమెంటులోనూ ఒక్కమారే ఖాళీలు ఏర్పడడంచూసి గవర్నమెంటు ఇంగ్లీషులోనూ, హిస్టరీలోనూ డిగ్రీలు కలిగిన ఓ నవ దంపతులను ఆవూరికి ట్రాన్స్‌ఫర్ చేశారు. ఆ అమ్మాయిపేరు లత. లతలాగే ఉంటుంది కూడా. అతనిపేరు రావు. అతను మటుకు అన్వర్థనామధేయుడుకాడు. అతనికి చాలావచ్చు. వాళ్ళు వచ్చిన వారం పది రోజులకే చాలా పాప్యులరు అయిపోయారు. అంటే పొలిటికల్ యాంగిల్‌లో కాదు. మామూలుగా లత అన్నా, రావు అన్నా "పాపం మంచివాళ్ళు" అనుకునేవారు. (పాపం ఎందుకు?)

మరోవారం అయీ అవకముందే ఓ రోజు లత మంచి హుషారుగా ఇల్లంతా సర్దడం మొదలు పెట్టింది. "ఎలాగైనా ఇల్లాలుకదా!" అనుకున్నాడు రావు హర్ష ప్రఫుల్లమానసంతో. లత నేడిపించా లనిపించిందతనికి.

"ఏం? నన్నింప్రెస్ చెయ్యాలని చూస్తున్నావా?" అన్నాడు.

"ఊహూ. మిమ్మల్నికాదు" అంది లత సీరియస్‌గా. రావుకి అర్థం కాలేదు. "మరి?"

"స్వర్ణగారిని భోజనానికి పిలిచాను."

ఒక్క నిముషంపాటు రావుకి నోట మాట రాలేదు.

"అప్పుడే మీ ఇద్దరికీ అంత స్నేహం అయి పోయిందేమిటి?"

"ఎంత సేపు కావాలి" అని లత స్వరం తగ్గించి, "చాలా మంచి మనిషండీ" అంది అతన్ని ఉడికిస్తున్నట్టు.

"అవునవును. అందులో ఈ రోజుల్లో మంచి వాళ్ళు చాలా అరుదు కూడాను" అన్నాడు రావు కించిత్ అప్రసన్నుడై. కొంచెంసేపూరుకుని, "అయితే చికెన్......" అన్నాడు లతాభిముఖుడై.

"నో, నో" అంది లత విముఖురాలై "ఆవిడ ప్యూర్ వెజ్."

"ఏం? ఈ రోజుల్లో వర్ణాంతర భోజనాలకి తప్పు లేదే."

"వర్ణాలూ, కృతులూ కాదేరండి ప్రశ్న అంది రిదీ ఏక నలుపేకదా?" అంది లత విసుగ్గా. స్వర్ణ 'మవర్ణం'కాదు.

"పోనీ, ఏం చేస్తున్నావ్?"

"వంకాయకూర, పెరుగు వడలు, ములక్కాడ వేసి పులుసు."

నీరసంగా కుర్చీలో కూలబడ్డ రావు వంక జాలిగా చూసింది లత. వంకాయా ఓ కూరేనా? అని అతడి భావం. "ఒక్క రోజుకేకదా" సర్దుకు పోవడం నేర్చుకోవాలని లత మనవి.

"నీ గురించే నా బాధంతా" అన్నాడు రావు.

"అంటే?"

"అంటే భర్తని అర్థాకలితో లేపిన ఆడదానికి ఊర్ధ్వలోకా లుండవంటూంటారు పెద్దవాళ్ళు."

"ఛీ. అలాటి మాట లనకండి."

రావు నోరు మూసుకుని రేడియో, పేపరు వరసగా విప్పేడు. పాపం అవేళ రావుకి కంచం లోంచి చెయ్యి నోటిదాకా వెళ్తే ఒట్టు.

"ఏవండీ? ఒంట్లో బాగులేదా? అలా ఉన్నా రేం?" అంది స్వర్ణ వివర్ణమైన అతడి మొహం చూసి.

"ఏంలేదండీ. ఏదో జ్ఞాపకం వచ్చింది. శ్రీనాథుడు గరళకంఠుడ్ని సవాలు చేశాడట విషం తాగేనని విర్రవీగుతావుకాని పలనాట బచ్చలిశాకం పులుసుతో జొన్నకూడు మింగు చూద్దాం అని."

లత తీక్షణంగా చూసింది రావువేపు. రావు గబుక్కున మంచినీళ్ల గ్లాసందుకున్నాడు. కష్టాలెప్పుడూ మంచివాళ్ళకే వస్తాయిట. (కష్టాలొచ్చాయంటే మంచి వాళ్ళయి ఉండాలిట) లేకపోతే రావు ఇలా అభోజనంగా ఉండనుకాక ఉండవని మొండిపట్టు పట్టి ఉండేవాడు. లత ఇలా అవమానంపాలై ఉండేదికాదు (పతిదేవుని మూలంగా) స్వర్ణ ఆహార వ్యవహారాల దగ్గిర తనతో పొసగని వాళ్ళతో స్నేహంచేసి ఉండేదికాదు. అన్నిటికీ వాళ్ళ వాళ్ళ మంచితనమే కారణం. సూక్ష్మంగా ఆ ముగ్గురూ ఆ సమయంలో ఆలోచిస్తున్న వాటి సారాంశం ఇది.

భోజనాలు అయేకా (అవకుండానూ) అందరూ వచ్చి డ్రాయింగ్‌రూమ్‌లో కూచుని ఆకులు వేసుకుంటుండగా—

"మీకు సంగీతం వచ్చునా?" అని లత స్వర్ణని అడిగింది.

"రాదు. మరి మీకు వచ్చునా?"

"నాకూ రాదు."

అక్కడితో ఆ సంభాషణ అయిపోవలసిందేకాని తెలుగు నవలలా, తెలుగు సినిమాలాగ అయిపోయి నట్టే అయిపోయి మళ్ళీ తలెత్తింది.

"నేర్చుకుందామా?" అంది స్వర్ణ.

రావు బిక్కు బిక్కుమంటూ లతవేపు చూశాడు.

"తప్పకుండా" అంది లత ఆనందోత్సాహాలు వదనంలో వెల్లివిరుస్తుండగా. లతకి అతిథులని ఎలా ఆదరించాలో తెలుసు అనుకున్నాడు రావు ఆనందంగా.

నాలుగు రోజులు పోయేక లత రావుతో "కాకివారి వీధులో వెంకటశాస్త్రిగారని ఒక సంగీతం మేష్టరున్నారుట. వెళ్ళి తీసుకురండి" అంది.

"అదేవిటి?" అన్నాడు రావు కొత్తగా చూస్తూ.

"తెలీనట్టు నటించకండి. మీముందేకదా స్వర్ణా, నేనూ నేర్చుకుందాం అని నిశ్చయించుకున్నది" అంది లత.

"ఊరికే అన్నావనుకున్నాను"

"కాదులెండి" అంది లత కొంచెం కఠినంగా.

రావు సరేలే అన్నాడు. రాత్రి "కనుక్కున్నారా" అనడిగితే లేదన్నాడు. మర్నాడూ అదే ఆన్సరిచ్చాడు. మూడోరోజు ధైర్యం వహించి, "ఇప్పుడు సంగీతం నేర్చుకోకపోతే ఏం లతా?" అన్నాడు నెమ్మదిగా.

అతనికి సంగీతం అంటే అంత కోపంలేదుకాని ఎమెచ్యూర్స్‌ని సహించలేడు. శాస్త్రీయ కచేరీలు అర్థంకావు. అంచేత అతను వినగలిగిందల్లా రేడియోల్లో లలిత సంగీతమూ, సినిమాల్లో శాస్త్రీయ సంగీతమూను. పెళ్ళిచూపులనాడే "మీ అమ్మాయి పాడదుకదా, పాట నేర్చుకుంటానని పేచీ పెట్టదుకదా" అని అడగలేదే అని విచారించవలసిన రోజొచ్చింది ఆతని జీవితంలో ఆఖరికి.

లత క్షణం వూరుకుని "సరేలెండి" అంది. కాని అది నాలిక చివర్నుంచి వచ్చింది.

మర్నాడు కాలేజిలో స్వర్ణ "కనుక్కున్నారా?" అని ప్రశ్నించింది లతని.

"లేదు. ఇవాళ కనుక్కుంటానన్నారు" అంది లత.

"నేను వీణకి వ్రాశాను" అంది స్వర్ణ "రెండు రోజుల్లో జవాబు రావచ్చు."

లతకేం చెప్పాలో తెలీలేదు. స్వర్ణ సరదా చూస్తుంటే లతకి హుషారొస్తూంది. అటు రావు తీరు చూస్తే నీరుకారిపోతూంది. "నిజంగా నా

## నిడదవోలు మాలతి

అభిప్రాయం ఏవిటో నాకు తెలీడంలేదు" అని తనలో తనే నణుక్కుంది.

ఆ రాత్రి మళ్ళీ రావు దగ్గిర "ఆ విషయం ఎత్తకుండా వూరుకోలేకపోయింది.

"స్వర్ణ వీణ మేకర్‌కి ఉత్తరం వ్రాశారుట" అంది.

రెండు రోజులు పోయాక స్వర్ణకి జవాబు వచ్చింది అని బులెటిన్ తెచ్చింది. మూడోరోజు బులెటిన్: వీణ మేకర్ ఆదివారం వూళ్ళో దిగుతాడని.

ఆఖరికి రావు విసుగ్గా "నువ్వు ఈ సంగీతం ఆపుతావా? నన్ను సన్యాసం పుచ్చుకోమన్నావా?" అన్నాడు.

లత హరిణలోచనాలతో అతనివేపు చూడడం చూసి, "అదికాదు. నన్నేం చెయ్యమంటావు చెప్పు?" అన్నాడు మందర స్థాయిలోకి దిగి.

"ఓహ్! మీరది ఒక ప్రపోజల్‌గా అంటే కన్సిడర్ చెయ్యొచ్చు. మీరు గ్రహించారో లేదో సంగీతానికీ, సన్యాసానికీ కూడా పన్నెండేళ్లే సాధన నిర్ణయించేరు ఆర్యులు" అంది లత కుదుటబడి.

"ప్రభుత్వాన్ని పన్నెండేళ్ళు లీవ్ అడగనా?" (హేళనగా)

"ఇవ్వరు రాబోలు"— (దిగులుగా)

"దానికేముంది? ఎక్స్‌ప్షన్‌గా కన్సిడర్ చెయ్యమందాం. వ్రాస్తాను— మా ఆవిడ సంగీతం నేర్చుకుంటుందిట. ఆ కాలపరిమితిలో నేను సన్యాసాశ్రమం చవిచూడాలనుకుంటున్నాను అని. అది ప్రివిల్యేజ్ స్టడీ కనక స్టడీ లీవ్‌కింద ఇచ్చినా ఇవ్వచ్చు" (మళ్ళీ హేళనగానే)

"అయినా ఇవ్వం అంటే....?" (ఇంకా దిగులుగా)

"అప్పుడేనా ఈ రికార్డు ఆపుతావా?"— (కఠినంగా.)

"........"—(నిస్సహాయంగా)

ఇలాటి సంభాషణలు అవుతుండగానే ఆదివారం వచ్చేసింది. దాంతోపాటు స్వర్ణ, స్వర్ణ వెనక వీణ మేకరూ, ఆ మేకర్‌తో వీణా రావుగారింటి కొచ్చేశారు.

"బాగుందండీ?" అంది స్వర్ణ.

"బాగానేఉంది" అన్నాడు రావు. లతకి వీణ చూస్తున్నకొద్దీ ముచ్చటేసింది. సన్నని దంతపు బోర్డరు చుట్టూ వేశాడు. ఫినిష్ మెరిసిపడి పోతూంది. మేళంచేసే తీసుకువచ్చాడు.

"ఇక్కడ ఉంచమన్నానండి. మీరు సాయంత్రం ఆ వీణ మేష్టర్ని పిలిస్తే, ఆయనకి కూడా చూపించి డబ్బిచ్చేస్తా నన్నాను." అంది స్వర్ణ.

"అలాగే. చెప్తాలెండి" అన్నాడు రావు. వాళ్ళు వెళ్ళిపోయాక రావు లతవేపు తిరిగి, "మీ చదువుకున్న ఆడవాళ్ళతో గెలవడం కష్టం సుమా" అన్నాడు. లత వీణవేపునుంచి దృష్టి మరల్చకుండానే "లేటుగా తెలుసుకున్నారు" అంది.

"ముందే తెలుసు"

"మరెందుకు చేసుకున్నారు?"

"నేను మొదటే చెప్పాను మా అమ్మతో— "నాకు చదువుకున్నవాళ్ళు వద్దూ, 'చాకలినాడొచ్చాడు పద్దు చూడండ'ని కాలేజీకి రాకుండా ఉంటే చాలూ అని. మా అమ్మే "ఈకాలపు చదువులలాగే ఉన్నాయీ. దానికైనా యమ్మే ఉండాలి" అని నిన్ను తీసుకొచ్చింది" అన్నాడు రావు.

"మీ దగ్గిరే కదండీ చదువుకున్నాను" రావు లతకి బి. ఏ. లో ఇంగ్లీషు చెప్పాడు. ఆ సంగతి మర్చిపోయాడు.

రెండు నెలలు తిరగకుండా రావు వీణ విశ్వనాథానికి శాస్త్రోక్తంగా పంచెలచాపూ, తాంబూలం, రెండువందల రూపాయలూ అర్పించుకుని లత చేత "నా వీణ" అనిపించేడు. లత సంతోషం చూశాక అతను కూడా నేనెంత దుర్మార్గుణ్ణి కాకపోతే ఆ పిల్లనలా క్షోభ పెడతాను అనుకుని తన్ను తాను నెన్ను చరుచుకున్నాడు చేసిన సత్కార్యానికి. కాని రోజూ సాయంత్రవేళ సంగీతం మేష్టరు వచ్చేవేళకి ఇంట్లో ఉండడం మటుకు అతని శక్తికి మించిన పనయింది. అదే కారణం వల్ల అతను మార్నింగ్ వాక్ కూడా అలవాటు చేసుకొన్నాడు. "పోనీ పాపం" అని లత కోపం తెచ్చుకోకుండా వూరుకుంది. రోజులలాగే జరిగిపోతే కథలు ఎక్కడి వక్కడే నిలిచిపోతాయి. కాకినాడ పాలిటెక్నిక్‌లో లెక్చరర్‌గాఉన్న సారధి కలకత్తానుంచివస్తూ దారిలో చెల్లెల్నిచూసి పోదాం అని దిగేడు. అన్నగారినిచూసి లత చాలా సంతోషించింది. సారధి వస్తూ వస్తూ ఓ టేప్ రికార్డరు కూడా తెచ్చాడు. "వెయ్యి. చూద్దాం" అంటే, దానికేవో మైనర్ ఎడ్జస్ట్‌మెంట్సు చెయ్యాలి, వీల్లేదు పొమ్మన్నాడు.

31 వ పేజీ చూడండి

# మనసున మల్లెలు

## రంగబాబు



### జ రి గి న క థ

**అదృష్టం వున్నా అవకాశాలు రాకుండా వృద్ధమూర్తి సుబ్బయ్య. బదిలీ అయిన వ్యవసాయ డెమాన్‌స్ట్రేటర్** రామారావుకు **హాళ్ళయింట్లో** గది అద్దెకు దొరుకుతుంది. విపరీత పరిస్థితుల్లో తారసపడిన ప్రసాద్‌ను దుర్గయ్య **ఆదరిస్తాడు.** అనుకోకుండా అతనికి విమల, **కమలలతో** పరిచయం ఏర్పాటు అవుతుంది.

### 3

కాఫీ త్రాగుతున్నంతసేపూ ప్రసాద్ కమల గురించేఆలోచించాడు. తనూ, కాలేజీలో చదువుతున్నప్పుడు అందమైన అమ్మాయిలను చూసాడు గాని, కమల కళ్లలోని మెరుపూ, ఆమె నవ్వులోని తళుకూ, ఆమె మొహంలోని వెలుగూ, ఆమె విగ్రహంలోని సొగసూ, ఇంతవరకూ చూడలేదు. ఆమెలోని ప్రత్యేకత ఏదో తను వివరించి చెప్పలేకపోయినా, తన హృదయాన్ని అపహరించిందని మాత్రం చెప్పక తప్పదు. ఈ పల్లెటూరులో తను, కాలం ఎలా గడపాలా? అని కొట్టుకు పోతున్న సమయంలో ఇలాటి అమ్మాయి కన్పించడం, ఆమె పరిచయాన్ని వృద్ధి చేసుకోడానికి తను వెయ్యవలసిన 'ప్లాను' గురించి ఆలోచించడం, తన జీవితంలో ఒక నవ్య పథాన్ని సూచించి, కాలం గడవడానికి ఎంత మాత్రం తను దిగులు పడనక్కర లేకుండా చేసింది ఈనాటి సంఘటన.

"తమ్ముడూ రైలాపింది నువ్వేనేమిటి?" అంటూ దుర్గయ్య వచ్చి, ఎదురు బెంచీమీద కూర్చుంటూ అడిగాడు. రైలు వెళ్లిపోవడంవల్ల హొటల్లో హడావుడి క్రమంగా తగ్గిపోయి దుర్గయ్యకు కొంచెం తీరుబాటు ఏర్పడింది. అతనికి ప్రసాద్ అంటే, ఎందుకో చెప్పలేని ఆత్మీయత పుట్టుకొస్తుంది. అందుకని ప్రసాద్ ఏంచేసినా అదొక పెద్ద ఘనకార్యంలా భావిస్తాడతను. ప్రసాద్‌కికూడా దుర్గయ్యంటే చాలా ఇష్టం.

"అవునన్నయ్యా! ఇన్నాళ్లకి రైల్వేవాళ్ళు ఒక మంచి పనిచేసి, నాలాటి యువకుడి జీవితంలో ఒక మార్పు తెచ్చారు".

"రైల్వేవాళ్ళు చేసిన మంచి పనేమిటయ్యా?" అని ప్రశ్నించాడు, అప్పుడే ప్రవేశించిన బుచ్చిశాస్త్రి. నుదుట విభూతి, బనీనుమీద కండువా, తువ్వాలు చేతిలో, పంచె కట్టుతో, మెడలో రుద్రాక్షలతో ముప్పైయ్యేళ్ల వయసుగల బుచ్చిశాస్త్రి, ఆ ఊళ్లో రెండో పురోహితుడు. మొదటి పురోహితుడు, బుచ్చిశాస్త్రిగారి అన్న రామశాస్త్రి.

"రండి శాస్త్రిగారూ! రైల్వేవాళ్ళు, ఒక ఫస్టుక్లాసు ప్రయాణీకురాల్ని, ప్లాటుఫారంమీద వదిలేసి రైలు నడిపెయ్యబోయారు. అప్పుడు నేను, అదే

అంటే ప్లాటుఫారమే) మా కొలీజి ఆటస్థలమను కుని, జరుగుతున్నది 'రన్నింగ్ రేస్' అనుకుని, అమాంతం పరుగెత్తి బ్రహ్మాండమైన వేగంతో పందెం గెలిచేశాను.—అంటే గార్డు పెట్టె పట్టుకున్నాను. గొలుసు లాగి బండి ఆపించాక ఆ ప్రయాణీకు రాల్ని బండి ఎక్కించాము. నాకు ఈ సదవకాశాన్ని కలుగజేసి, నా పరుగు నైపుణ్యాన్ని జనానికి ప్రదర్శింపజేసినందుకు, రైల్వేవారిని నేను అభినందిస్తున్నాను." అన్నాడు ప్రసాద్.

"భేష్! అయితే ఆ ప్రయాణీకురాలు నిన్నెంతో మెచ్చుకుని ఉంటుంది. ఏం? అంతేనా?". అని అడిగాడు బుచ్చిశాస్త్రి. "ఆవిడ మెప్పుదల కోసమే నువ్వీ పనిచేసి ఉంటావని నా నమ్మకం. రామం కాఫీ పట్రా!" అని సర్వరుకి పురమాయించాడు. అప్పుడు హోటల్లో బుచ్చిశాస్త్రి, దుర్గయ్యా, ప్రసాద్ మాత్రమే ఉన్నారు. ఇద్దరు సర్వర్లు ఇటూ, అటూ తిరుగుతున్నారు.

కాఫీ తెచ్చిన సర్వర్ రామం, "కాదు సార్. ప్రసాద్‌గారు కోరింది, మరొకరి మెప్పు. అందుకు రైలు బాగా పనికొచ్చింది." అన్నాడు. అతని మాటకు అందరూ ఆశ్చర్యపోయారు., రామం వయస్సు పద్దెనిమిదేళ్లు.

"ఎవరి మెప్పు?"

"సుబ్బయ్యగారి చిన్నమ్మాయిగారు కమలగారు"

"ఓరి పిడుగా! ఎలా కనిపెట్టేశావ్?" అని ప్రసాద్ అంటూంటే బుచ్చిశాస్త్రి, దుర్గయ్యా నవ్వసాగారు. దుర్గయ్య, "తమ్ముడూ దొరికిపోయావ్" అన్నాడు. బుచ్చిశాస్త్రి, "మొత్తానికి మనవాడు పెద్ద ఎత్తే వేశాడు" అన్నాడు. రామం ప్రసాద్ వైపు చూచి, పూరుకున్నాడు.

"చెప్పు" గద్దించేడు ప్రసాద్.

"నేనుకూడా ప్రేమించాను సార్!" అన్నాడు విచారంగా రామం. వాడు లుంగీ, చొక్కా వేసుకుని సన్నగా, పొట్టిగా ఉంటాడు. మొహంనల్లగా ఉంటుంది. చాలా చురుకైనవాడు.

"నువ్వా? కొంపతీసి నాకు ప్రతిస్పర్థివవుతావా ఏమిటి?" అన్నాడు ప్రసాద్. దుర్గయ్యా, బుచ్చిశాస్త్రి నవ్వారు.

"ఆమెను కాదుసార్. వాళ్లింటో పనిచేసేది సార్. నళిని అని భలే చురుకైన పిల్లసార్. కాని ఎక్కడికో వెళ్లిపోయింది సార్. అందుకని ప్రేమకోసం మనుషులేం చేస్తారో నాకు తెలుసుసార్".

"నువ్వేం చేశావు, నళినికోసం?"

"చెల్లెక్కి జామకాయలు కోస్తుండే వాణ్ణి సార్." అని చెప్పి లోపలికి వెళ్లిపోయాడు రామం.

"అయితే అబ్బాయీ, నన్ను లగ్నం అదీ పెట్టించి సిద్ధంగా ఉండమంటావా?" అన్నాడు బుచ్చిశాస్త్రి నవ్వుతూ, అని "కొంపతీసి కె.ఎస్. రావులా చెయ్యకు సుమా" అన్న మాటలుకూడా దుర్గయ్యావేపు చూస్తూ అన్నాడు.

దుర్గయ్య, 'కె.ఎస్.రావు మరి కనిపించనట్లేనా?' అన్నాడు.

"ఆ. సందేహంలేకుండా. పాపం ఆ రాజుపేట వాళ్ళు గోల! ఆ అమ్మాయిని వివాహం చేసుకుంటానని, నట్టేట్లో ముంచాడు. పదిహేను రోజుల్నుంచీ పత్తాలేడు. 'దుర్గయ్యగారి హోటలుకు వస్తే చెప్పమనండి' అని చెప్పారు పాపం. అలాగేనన్నాను."

అన్నాడు బుచ్చిశాస్త్రి.

"కె.ఎస్.రావు ఎవరండీ?" అని అడిగాడు ప్రసాద్.

"ఈ చుట్టు ప్రక్కల, అదేదో కాఫీ, టీలమ్మే కంపెనీ సేల్సుమన్‌గా ఉండేవాడు. సుమారు ఆరు నెలలు పనిచేశాడు. ఈ ప్రక్క వూళ్లన్నీ తిరుగుతూం డేవాడు. రాజుపేటలో రామావతారంగారని, చాలా మర్యాదస్తులు. వారమ్మాయితో ప్రణయ కలాపం జరిపాడు. పెద్ద వాళ్లకు తెలిసేసరికి, ఆ అమ్మాయిని వివాహం చేసుకుంటానని అన్నాడు తరువాత వారం రోజులకు అకస్మాత్తుగా మాయ మయ్యాడు. వూళ్లో అందరికీ బాకీలే. దుర్గయ్యకు కూడా ఏమాత్రమో ఇవ్వాలి." అన్నాడు బుచ్చిశాస్త్రి.

"నా బాకీకేంలేగాని, కనిపిస్తే మట్టుకు కాళ్లూ, చేతులూ కట్టి, ఆ అమ్మాయి మెళ్లో పుస్తె కట్టిస్తా." అన్నాడు దుర్గయ్య.

ఇంతలో రామం వచ్చి, ప్రసాద్‌తో, "గిరిబాబు గారు వస్తున్నారు, సార్" అని చెప్పేసరికి, ప్రసాద్ ముందు ఖంగారు పడ్డా, తరువాత ధీమాగా కూర్చున్నాడు. గిరిబాబు హోటల్‌లోకి కంగారుగా వచ్చాడు.

"తమ్ముడూ, నా ఫ్లాస్కేదీ?" అని అడిగాడు.

"గిరిబాబుగారూ, నటన అనేది ఒక గొప్ప కళ దాన్ని ఆరా....."

"నటన కాదయ్యా, నా ఫ్లాస్కు ఏమయిందని? అడుగుతున్నాను"

"....ధించడం అందరికీ సాధ్యంకాదు. రేపటి నుంచీ నేనూ మీలాగే కళారాధన చేస్తాను. మీరు నన్ను తర్ఫీదు చెయ్యండి....."

"అంతేగాని ఫ్లాస్కు ఇవ్వవన్నమాట!"

"ఫ్లాస్కు సంగతేనండి చెప్తున్నాను. మీరు మహా నటకులని, మిమ్మల్ని సినిమాలలో చేర్పించాలని ఎన్నాళ్లనుంచో కోరికతో ఉన్నాను. కలకత్తాలో ఒక ఫిలిం నిర్మాత ఉన్నారు. మాకు తెలిసి నాయన. ఆయన భార్య మద్రాసు వెళ్తోంది. ఆవిడకు ఫ్లాస్కు కావలసి వచ్చింది. మీ ఫ్లాస్కు ఇచ్చాను. 'ఇది నట శిఖామణి గిరిబాబుగారి ఫ్లాస్కు' అని తెలుసుకోగానే, ఆమె మిమ్మల్ని, భర్తతో చెప్పి సినిమాల్లోకి తీసుకునే ఏర్పాటు చేస్తుంది. నిరంతరం మీరు వాళ్లకి జ్ఞాపకముండేట్లు చేస్తుంది ఆ ఫ్లాస్కు! రేపో మాపో మీకు సినిమాల్లో నటించడానికి రమ్మని ఆహ్వానం వస్తుంది. అప్పుడు మీరు వెళ్లి, తెరమీద దుర్యోధన పాత్ర నటిస్తారు. మీరు నటించిన చిత్రం ఆంధ్ర దేశమంతటా అశేష జనాన్ని విశేషంగా ఆకర్షించి, శతదినోత్సవాలు చేసుకుంటుంది. మీకు సన్మానాలమీద సన్మానాలు జరుగుతాయి, గొప్ప బిరుదులు లభిస్తాయి. 'అభినవాంధ్ర దుర్యోధన' అని పిలుస్తారు. మీ దర్శనంకోసం ప్రజలు తహతహలాడిపోతారు. పూలమాలలతో మిమ్మల్ని అలంకరిస్తారు. అప్పుడు మిమ్మల్ని చూడడానికి వచ్చే జనంలో నేనూకూడా ఉంటాను. జనం రద్దీలో, హడావుడిలో నా బట్టలు నలిగిపోతాయి. వేలకొద్దీ వచ్చే జనంలో, బట్టలు మాసిపోవడం ఒక లెక్క కాదనుకోండి. కాని బట్టలు మాసినప్పుడు లాండ్రీకి వెయ్యక తప్పదు. కనుకనేనిప్పుడే లాండ్రీకి వెళ్లి బట్టలు వేసేస్తాను. శలవు" అని ప్రసాద్ బల్లిబొల్లిమాటలాంటి, గిరిబాబు నోరు వెళ్లబెట్టి చూశాడు. బుచ్చిశాస్త్రి, దుర్గయ్యా నవ్వుకున్నారు.

## 4

సైపు ఇన్‌స్టిట్యూట్‌లో చేరడం మంచిదని అవునా? కాదా? అని రెండు రోజుల్నించి ఆలోచిస్తున్న కమలకు, ప్రొద్దున్న స్టేషనుతో జరిగిన సంఘటనతో, తను చేసింది మంచిపనే అన్న ధైర్యం వచ్చింది. స్టేషన్‌లో కన్పించిన యువకుడు ఈ వూరి మనిషికాడు. అతనిలో, పట్నవాసపు లక్షణాలు పూర్తిగా కన్పిస్తున్నాయి. అతని రూపం సాహసం, కమల హృదయాన్ని ఆకర్షించడంలో విశేషమేమీలేదు. తనే గనుక పట్టుబట్టి చదువు కోసం పరాయి వూరు వెళ్లిపోతే, అసలీ యువకుణ్ణి చూడగలిగి ఉండేదికాదు. కాబట్టి సై పూరికి వెళ్లకపోవడం ఒక మంచిపని. అంతేకాక సైపు ఇన్‌స్టిట్యూట్‌లో చేరడంవలన, రోజూ తను స్టేషను మీదుగా వెళ్తుంది. ఆ సమయంలో అతనిని చూసే అవకాశం కలుగుతుంది. కమల మనసులో చాలాసేపూ అతని రూపం మెదుల్తూ ఉంది.

"అక్కయ్యా! ఈ బొమ్మలు చూశావా?" అంటూ రవికుమార్, విమలా, కమలా ఉంటున్న మేడమీద గదిలోకి వచ్చాడు. అతను ఇరవై రెండేళ్ల యువకుడు, నల్లగా కొంచెం బొద్దుగా ఉంటాడు. ఫోటోలంటే తగని పిచ్చి. అప్పుడే తమ ప్రక్క మేడలో అద్దెకు దిగిన రామారావు గారితో పరిచయం కావడం, ఆయన గీసిన చిత్రాల ఆల్బమ్ చూసి అతను చాలా ముచ్చటపడడమే కాకుండా తన విమలక్కయ్యకు కూడా చూపించి తెస్తాననడం జరిగింది. అతను ఎప్పుడూ నల్లని పులెన్ పాంటు, మీద, గీతలున్న రంగురంగుల చొక్కాలు వేసుకుని చేతిలో కెమెరాతో తిరుగుతూంటాడు. కళ అన్నా కళాకారులన్నా అతనికి విపరీతమైన అభిమానం. రామారావుగారి బొమ్మ లతన్ని ఎంతో ఆకర్షించాయి. అతను తెచ్చిన ఆల్బమ్‌ను చూడడానికి ఇద్దరు అక్కచెల్లెళ్లూ ఎగబడ్డారు. "ఎంత బావున్నాయో?" అనుకుంటూ చూడసాగారు.

"ఆయన ఇంత గొప్ప చిత్రకారులనుకోలేదు" అంది విమల.

"మరేమిటనుకున్నావ్! నేనాయనను చూడగానే పోల్చేశాను. కొంచెంసేపు మాట్లాడాక 'మీరు చిత్రకారులనుకుంటాను.' అని అడిగేశాను. ఆయన నవ్వుతూ అవునన్నారు. అక్కణ్ణుంచి ఆయన చిత్రాలన్నిటిని బయటకు తీయించాను. వాటిని చూశాక ఆయన గొప్పతనం నేననుకున్నదానికంటే మించినదని తెలుసుకున్నాను. ఈ పల్లెటూరిలో 'ఆర్ట్' అంటే ఏమిటో తెలియకపోవడంవల్ల ఏమీ చెయ్యలేం కాని, లేకపోతే ఒక చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు చెయ్యవచ్చు, ఆయన బొమ్మలతో. అన్నట్టు చెప్పడం మరిచాను, 'చిన్నా' ఎల్లుండి మన హైస్కూలు ప్రోగ్రాముకి ఆయనను కూడా ఆహ్వానించాను. నువ్వు బాగా పాడతావనీ, ఆయన వచ్చి విని తీరాలనీ చెప్పి వచ్చాను."

"అప్పుడే ఆయనకూ, నీకూ బాగా స్నేహం కలిసినట్లుంది." అంది విమల, తమ్ముడైన రవికుమార్‌యొక్క చొరవను మెచ్చుకుంటూ.

"ఓ! అన్నట్టు, అక్కయ్యా నీకు హిందీ చెప్ప

## మనసున మల్లెలు

దానికి తీరిక ఉంటుందా?" అని అడిగాడు రవి కుమార్, ఒక ముఖ్యమైన విషయం గురించి అడుగుతున్నట్టు మొహంపెట్టి.

"హిందీయా? ఎవరికి?"

"ఎవరికో కాదులే. మన రామారావుగారికేనూ"

"బావుంది. నాన్నగారు ఏంటే. ఒళ్ళు విరు స్తారు"

"అంటే నీకేమీ అభ్యంతరం లేదన్నమాట"

"అదికాదురా.......మరి....."

"నువ్వూరుకో నాన్నగారి చేత పర్మిషను నేనిప్పి స్తాను"

ఇంతలో 'చిన్న' "అన్నయ్యా నాన్నగారికి బొమ్మలు చూపిస్తా వేమిట్రా?" అని అడిగింది.

"చూపిస్తే, బావుందని మెచ్చుకుని, చచ్చిపోయిన మన అమ్మమ్మ ఫోటో మొదలుకొని, మన ఇంట్లో అందరి ఫోటోలూ ఇచ్చి, వాటిని ఎన్‌లార్జి చెయ్య మంటారు. పాపం! ఆయన్ని ఇరుకున పెట్టడం తప్ప మరేమీ లాభంలేదు. నాన్నగారికి వ్యాపార దృష్టి తప్పిస్తే మరో దృష్టి లేదు. ఆయనకు చూపిం చక పోవడమే ఉత్తమం. మీ రిహార్సల్సు ఎంతవరకూ వచ్చాయి?"

"ఏదో అలాగే జరుగుతున్నాయి. మొత్తానికి ప్రోగ్రాం జరిగిపోతుంది. కాని ఆ పిల్లలకు నేర్పించే సరికి, వాటళ్ళు హూనం అవుతోంది. పైగా ఆ పిల్లల తలితండ్రులు మధ్యలో 'మేము మా అమ్మాయిని పంపించం' అని బెదిరిస్తుంటే వాళ్ళకి వెళ్ళి నచ్చచెప్పడం ఒక పెద్ద పని అయిపోతోంది."

"చాకెలెట్లూ, పిప్పరమెంట్లూ అయిపోయినట్లు న్నాయి. మళ్ళీ తెప్పించావే చిన్నా?" అని అడిగింది విమల.

"అవోహ దండుగ. బాగా అవి తినటం మరిగి, అవి లేకపోతే అసలు అడుగెయ్యటం మానేస్తు న్నారు." అంది చిన్న.

"పోన్లేవే. అవి తిన్న తరువాతా, వాటిమీద ఆశకొద్దీ బాగా చేస్తున్నారుకదా బాగా తెప్పించు వాళ్ళు బాగా చేస్తే, వాళ్ళనలా తర్ఫీదు చేసినందుకు నీకే మంచి పేరొస్తుంది. చివరికి అంతా నిన్నే మెచ్చుకుంటారు"

"సరిగ్గా చెప్పావు అక్కయ్యా. కుమారి కమల నిర్వహణలో 'పంచవర్ణ ప్రణాళికా' నృత్యం అద్భు తంగా ఉందని అందరూ మెచ్చుకున్నప్పుడు నీపేరే పైకి వస్తుంది. మరో విచిత్ర మేమిటంటే, సరిగ్గా మా ప్రోగ్రాముకి ముందరే, శ్రీ నటశేఖర గిరిబాబుగారి ఏకపాత్రాభినయం — 'దుర్యోధన'! ఆ సమాసాల జోరుకి హోరెత్తిపోయి 'బోరు' కొట్టేసిన ప్రేక్షక జనానికి, నీ 'బాక్‌గ్రౌండు' మృదు మధురగానం, బాలికల నృత్యం అద్భుతంగా కన్పిస్తాయి. తరువాత ఒక నాటిక, భరతమాత 'టాబ్లో' జనగణమన అయ్యేసరికి, ప్రేక్షకులు నిన్నే ఎంతో మెచ్చుకుంటారు. ఈ ప్రోగ్రాముకి పెద్ద పెద్ద వాళ్ళు వస్తున్నారు."

"నా సంగతికేంగాని, నీ స్టేజి ఏర్పాట్లన్నీ చక చకా జరుగుతున్నాయా?" అని అడిగింది కమల. ఈ ప్రోగ్రాములో రవికుమార్ స్టేజీ నిర్మాతగా

లైట్ల ఏర్పాటూ, మొదలైన అనేక పనుల నిర్వాహకుడుగానూ ఉంటున్నాడు."

"హెడ్మాష్టారికి పురిటి శుద్ధి కాలేదట. డ్రిల్లు మాష్టారి భార్యకి గుండెనీరసం వల్ల, ఆయనే ఇంట్లో వంటా, పనులూ చేసుకుంటూ సెలవు పెట్టారు. అందుకని తెరలూ వగైరాలూ మాకు ఇంకా అందలేదు. రేపు సాయంత్రానికి స్టేజి తయారు చేసేస్తాం" అన్నాడు రవికుమార్.

ఇంతలో సుబ్బయ్యగారు పిలవడంవల్ల రవికుమార్ క్రిందికి వెళ్ళిపోయాడు. కమలకు రిహార్సల్సు వేళ కావటంవల్ల ఆ ఏర్పాటులో ఆమె ఉండింది. పిల్లలొక్కరొక్కరే రాసాగారు. ఇక రెండు రోజులలో జరుగబోతున్న, రామనగరం హైస్కూలు వార్షికోత్సవంలో ఒక అరడజను ఆడపిల్లచేత ఒక చిన్న 'డాన్సు ప్రోగ్రాము' ఏర్పాటు చేసి, తెరవెనుక ఆ నృత్యానికి అనుగుణంగా కమల పాడబోతోంది. ఆ వూరిలో కాస్త ఆటా, పాటా అంటే ఉత్సాహం ఉన్నది వీరి కుటుంబమేనూ. విమలకు, కమలకూ ఇలాంటి ప్రదర్శనలంటే ఎంతో సరదా. ఈ నృత్యం ఏర్పాట్లంతా, విమల ప్రోద్బలంవల్ల కమలే చేసింది. కాస్త చురుకైన ఆడపిల్లల్ని కనుముక్కు తీరు బాగున్న వాళ్ళని, ఎన్నుకుని తర్ఫీదు ఇస్తోంది.

"హిందీ తను రామారావుగారికి చెప్పడం" అన్న విషయం జ్ఞాపకంవచ్చి విమల తనలోతను నవ్వుకుంది. అసలు తమ్ముడి అమాయకత్వంగాని, లేకపోతే ఆ మాట వినగానే నాన్నగారు మండిపోరూ. అనుకుంది ఆమె. కాని సుబ్బయ్యగారి భావాలు ఆమెకు తెలియవు. ఆయనకు విమలంటే ప్రాణం. ఆమెకు విధివల్ల జరిగిన అన్యాయానికి ఆయన ఎంతో బాధపడిపోతున్నారు. ఆమె మనస్సు బాధ పడకుండా, ఆమెకే లోటూ రాకుండా పెంచుతున్నారు. ఆమె మాటకు తిరుగులేకుండా సాగనిస్తున్నారు. కమలనూ, రవికుమార్‌నూ చాలా అదుపాజ్ఞలలో ఉంచారుగాని, విమలనెన్నడూ ఏ విషయంలోనూ ఆయన శాసించలేదు. రామారావు, విమల అంటే చూపిస్తున్న ఉత్సాహం, విమల రామారావు గది అద్దె విషయంలో కల్పుగజేసుకోవడం ఆయన దృష్టి నాకర్షించక పోలేదు. అసలు రామారావునుకూడా ఆయన ఒక ప్రత్యేక గౌరవంతో చూస్తున్నారు. అతనొక బుద్ధిమంతుడైన, సత్ప్రవర్తనగల యువకుడని ఆయన అభిప్రాయం.

స్కూలుపిల్లల జీవితంలో వార్షికోత్సవ దినం ఒక ఒక గొప్ప పండుగలాంటిది. రామనగరానికి హైస్కూలు వచ్చి సుమారు మూడేళ్ళయింది. చాలా క్లాసులు ఇంకా పాకలలోనే నడుస్తున్నాయి. క్రమంగా వాటిని భవనాలుగా మార్చాలని రామనగరం గ్రామవాసులూ, ఆ చుట్టుపట్ల గ్రామాలలోని ప్రభులూ చాలా పట్టుదలగా ఉన్నారు. ప్రజలలో ఎంత ఉత్సాహం ఉందో, తమలో కూడా అంతే ఉత్సాహం ఉందని అంతే కాక, తాము చాలా కష్టపడి, పిల్లలకు విద్య నేర్పుతున్నామనే విషయం, ఆ స్కూలు హెడ్మాష్టరుగారికీ, ఉపాధ్యాయ బృందానికీ మనస్సులలో ఉండడమే కాక, ప్రజ లందరికీ వెల్లడిచెయ్యాలని ఉంది. అందుకు వార్షికోత్సవం ఒక గొప్ప సదవకాశం. హెడ్మాష్టరుగారు స్కూలు ఏవిధంగా పనిచేస్తుందో ఒక 'రిపోర్టు' చదవచ్చు. తన అభిప్రాయాలని చెప్పవచ్చు. అదే సమయంలో ఆ స్కూలు కమిటీ పెద్దల్ని పొగిడి, తమ భవిష్యత్తుకు మంచి పునాది వేసుకోవచ్చు. పైగా ఆటలపోటీలూ మొదలైన పోటీలలో గెలుపొందినవారి పేర్లు గంటలకొద్దీ చదివి ఈ హైస్కూలు, విద్యార్థులను ఆటలలో కూడా ఎంతో ప్రోత్సహిస్తుందనే విషయం ప్రజలకు వెల్లడి చెయ్యొచ్చు. అన్నిటికన్నా ముఖ్యమైన విషయం, ఈ ఉపన్యాసాలంటే వాళ్ళ కిష్టం లేకపోయినా, ఈ ఉపన్యాసాల తరువాత జరిగే ప్రదర్శనల కోసమే జనం ముఖ్యంగా వస్తారు కాబట్టి ఉపన్యాసాలు ముందుండి, ప్రజల్ని వాటిని వినేట్టు చేసి తీరతాయి. ఒకవేళ ప్రదర్శనలు ముందు పెట్టి తరువాత ఉపన్యాసాలు పెట్టడం తటస్థిస్తే ఉపన్యాసకులే మిగుల్తారు కాని, ప్రదర్శనల తరువాత ప్రజ లుండరనేది ఖాయం.

హైస్కూలు హెడ్మాష్టరు దాశరధిగారు, చాలా వివేకంతో ఆనాటి సభకు అధ్యక్షత వహించడానికి, స్కూలు కమిటీ అధ్యక్షులూ, అసెంబ్లీ మెంబరూ అయిన సోమనాథంగారిని ఆహ్వానించారు. ఆయన అనుకున్నట్టుగానే సోమనాథంగారి యందుండే గౌరవం వల్ల చాలామంది జనం వచ్చారు. స్కూలు ఆవరణలోనే బెంచీలు వేసి, రవికుమార్ ఒక 'స్టేజి' తయారుచెయ్యడమే కాకుండా, తెరలు మొదలైన వాటిలో చాలా ఆకర్షణీయంగా ఏర్పాటుచేశాడు. స్టేజి ప్రక్కగా ఉన్న ఫిఫ్తుఫారం క్లాసురూము గ్రీన్ రూముగా నటకులకూ, నటీమణులకూ ఇచ్చారు. ప్రోగ్రాం ప్రకారం అయిదు గంటలకు మీటింగు ప్రారంభమై ఏడున్నర గంటలకు ముగుస్తుంది. తరువాత ప్రదర్శనలు ప్రారంభమౌతాయి. ఇంతకుముందే రవికుమార్ తన సోదరీమణులతో చెప్పినట్టు, ఈ ప్రదర్శనలు గిరిబాబుగారి దుర్యోధన ఏకపాత్రాభినయంతో ప్రారంభమై తరువాత పిల్లల నృత్యం వగైరా జరుగుతాయి. కుమారి కమల ఆధ్వర్యం క్రింద.

గిరిబాబు తన ఫ్లాస్కు పోవడం ఒక పెద్ద దుశ్శకునంగా భావించి, ఈసారి తన ప్రోగ్రాము విజయవంతం కాదని, ఈ మూడు రోజుల్నుంచీ చాలా విచారంగా ఉన్నాడు. దానికి తగ్గట్టు, అతనికి ప్రతి ప్రదర్శనలోనూ, 'ప్రాంప్టింగు' ఇస్తుండే శిష్యుడికి జ్వరం రావటంవల్ల, తగిన ప్రాంప్టరు లేడే అన్న బాధ ఒకటి తోడయింది. కాని, ప్రసాద్ యీ విషయంలో ముందంజవేసి, తను ప్రాంప్టరుగా ఉండటానికి ఒప్పుకున్నాడు. ప్రసాద్ ఏపని చేస్తేనన్నా, గిరిబాబుకు, తగని అనుమానం. తనని నలుగురిలో అవమానంపాలు చేస్తాడేమోనని, అయినా ప్రస్తుతంలో అంతకన్నా గత్యంతరంలేక అందుకు ఒప్పుకున్నాడు. ప్రసాద్ ప్రాంప్టింగ్‌తో నాలుగైదు రిహార్సల్సు వేశాక, గిరిబాబుకు కొంత ధైర్యం వచ్చింది. కాని, ఫ్లాస్కు లేకపోవడం ఒక పెద్ద తీరనిలోటు కదా! 'వేడి వేడి కాఫీ త్రాగందే కళాకారుడికి నటన ఎలా విబ్బుతుంది?' అని వాపోయాడు! చివరకు దుర్గయ్య ఎక్కడో ఒక ఫ్లాస్కు సంపాదించాక, కొంత తృప్తి పొందాడు.

అయిదు గంట లవకుండానే గ్రీన్ రూముకి గిరిబాబు, ప్రసాద్‌తో సహా చేరుకున్నారు. ప్రసాద్ ఆయనకు అన్నివిధాలా సహాయపడాలని నిశ్చయించుకున్నాడు. తనకు డ్రామాలలో వేషం వెయ్యటం కాలేజీలో అలవాటుండడంవల్ల, మేకప్ విషయం కూడా బాగా తెలుసు. గిరిబాబు కేక్ తీసి, కోటా కొట్టుకోవడం ఆరంభించిన దగ్గర్నుండి, ప్రసాద్ తన దృష్టిని పూర్తిగా ఆయన మీద కేంద్రీకరించి ఏవిధంగా అతని మొహాన్ని తీర్చి దిద్దితే ఆ మొహంలో రాజరాజుకి ఉండవలసిన గంభీరత వస్తుందో, హుందాతనం వస్తుందో ఆలోచించి మరీ, సరిచేస్తున్నాడు. విగ్రహం అంతా తయారయ్యేసరికి గంటన్నర పట్టింది. ఈలోపల కొంతమంది బాలికలు ఆ గదిలో ప్రవేశించి, తమ డ్రెస్సు గురించి గొడవ చేస్తుంటే, ప్రసాద్ వాళ్ళ వైపైనా చూడలేదు. నీలంరంగు చెమ్కీకోటు ధరించి, తలమీద అట్ట కిరీటం పెట్టుకుని, మీసం సరిగ్గా ఉందో లేదో చూసుకుంటూ నిలబడిన గిరిబాబును చూసేసరికి, ప్రసాద్ సంతోషంతో తల ఊపుతూ, ఆయన మేకప్ పూర్తయిందనీ, చాలా బావుందనీ అన్నాడు. "ఓహోహో ఇప్పుడు మీరు అచ్చు దుర్యోధనుడిలా ఉన్నారండి. మీరు స్టేజి ఎక్కేసరికి మీ విగ్రహం చూసే ప్రజలు ఆశ్చర్యపోతారు" అని పొగుడూ ఆయనను

45 వ పేజీ చూడండి



# మేలురకం కాఫీ గింజలతో తయారైంది
# ...శాస్త్రీయ పద్ధతిని వేచి పొడి చేయబడింది
# ...పరిశుద్ధమైనదని హామీ!

Brooke Bond
french coffee
(blended with chicory)

Brooke Bond
pure
coffee

**నాణ్యతకై ఎంచబడిన:** దక్షిణాదిలో పండే ఒకటో రకం కాఫీ గింజలనే బ్రూక్ బాండ్ వారి నిపుణులు ఎంచుతున్నారు. మరి మీరు కొనే కాఫీ మిక్కిలి శ్రేష్ఠమైందిగా వుండాలికదా!

**మంచి సువాసన, కమ్మదనం వుండేలావేచారు:** నవీన శాస్త్రీయ పద్ధతిని వేచబడి నందుననే మీకు సాటిలేని రుచి, కమ్మదనం యిచ్చి తృప్తిపరుస్తోంది.

**అత్యంత పరిశుద్ధతకై గాలిచొరలేని డబ్బాలలో భద్రపరచబడి:** చేతితో తాకకుండా ఆరోగ్యప్రదమగు రీతిని గాలి చొరలేని డాబ్బాలలో, సీలుమార్చి కల్తీచేయ శక్యంగాని రీతిని ప్యాక్ చేయబడి, బ్రూక్ బాండ్ కాఫీ ఎంతో తాజాగా, రుచిగా, కమ్మదనం అలాగే వుండేలా సీలు చేయబడింది.





# అయిదు గుడ్లు

యువాన్ ఒక పేదరైతు. యువానికా అతని భార్య. చాలా అన్యోన్యంగా వుండేవారు. అయినా బీదవారు కనుక ఒక్కొక్కప్పుడు రోజుల వెంబడి పస్తుండేవారు.

ఒకసారి, మూడు రోజులు తిండి లేకుండా బాధపడిన తర్వాత యువానికా భర్తని అడిగింది, "ఇంకా ఎన్ని రోజులిలా?" అని.

"భయపడకే! ఇవాళే ఊళ్ళోకి పోయి అయిదు గుడ్లు కొనుక్కొస్తాను. ఉడకబెట్టి తిందాం," అన్నాడు యువాన్.

ఊళ్ళోకి వెళ్ళనే వెళ్లాడు. వీధిలో ఒక మూలనుంచుని ధర్మంకోసం అడుగుదా మనుకున్నాడు. ఒక మనిషెవరో కనిపించగానే, "నాలుగు సెంట్లు ఇస్తే ఒక గుడ్డు కొనుక్కుంటా! ఇప్పించగలరా?" అని అడిగాడు. అతనూ మంచివాడేమో వెంటనే నాలుగు సెంట్లూ ఇచ్చేశాడు.

ఇలా అయిదుమందిని అడిగి ఇరవై సెంట్లు సంపాదించాడు. వాటితో అయిదుగుడ్లు కొనేశాడు. ఇంటికి బయలుదేరాడు. ఇంటికి చేరుకున్నాడు. చేరుకుని భార్యకి గుడ్లని వప్పచెప్పి ఉడకబెట్టమన్నాడు. ఆమె వంటింట్లోకివెళ్ళి కొంతసేపు తర్వాత భర్తని పిలిచింది–"యువాన్! వచ్చి నీ గుడ్లు రెండూ తిను. వండినందుకు మిగతా మూడూ నే తింటాను!" అని కేకేసింది.

అతను వప్పుకోలేదు. తనకి మూడూ, యువానికాకి రెండూ అన్నాడు. ఇద్దరూ వాదనలోపడ్డారు. ఎంతసేపు వాదించుకున్నారో తెలీదు. ఇలా కొంతకాలం దండగయింది.

30 వ పేజీ చూడండి



# మీ పాపాయి ఫోటో పంపండి

పోటీలో పాల్గొనేముందు యీ నిబంధనలను జాగ్రత్తగా చదవండి:

1. ఈ పోటీలో ఇండియన్ యూనియన్‌లో నివసించే వారే పాల్గొనాలి. జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీయొక్క మరియు జె. వాల్టర్ థామ్సన్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్ యొక్క ఉద్యోగులు పాల్గొనుటకు అర్హులుకారు.
2. జాన్సన్స్ బేబీ పౌడరుయొక్క ఒక ఎకానమీ సైజు లేక పెద్ద సైజు డబ్బాగాని, రెండు మీడియమ్ డబ్బాలుగాని మీరు కొన్నట్లు చూపే దుకాణదారుని ప్రింటుచేయబడిన రసీదును ప్రతి ఫోటోతోను జతపరచాలి.
3. పోటీలో పాల్గొనేవారు ఎన్ని ఫోటోలనైనా పంపవచ్చును. కాని ప్రతి ఫోటోతోను ఒక రసీదు పంపాలి. ఫోటో వెనుక భాగములో పోటీదారుని పేరు, ఎడ్రసు స్పష్టముగా వ్రాయాలి.
4. 18 నెలల వరకు వయస్సుగల పాపల ఫోటోలను మాత్రమే పంపాలి. ఫోటోలు 3" x 4" సైజుకు తక్కువ కాకుండా బ్లేక్ అండ్ వైట్ ప్రింట్లుగా ఉండాలి. పోటీదారులకు ఫోటోలు త్రిప్పి పంపబడవు.
5. ప్రతి ఎంట్రీ.నిర్ణయదారుల సంఘముచే జాగ్రత్తగా పరీక్షింపబడుతుంది. వారు చేసిన నిర్ణయమునకు తిరుగులేదు మరియు యీ విషయములో ఉత్తర ప్రత్యుత్తరములు జరపబడవు.
6. ఫోటోను యిక్కడ ఇవ్వబడిన ఎంట్రీ కూపనుతో జతచేసి పంపాలి. కావలిస్తే ఎక్కువ ఎంట్రీ కూపనులను మీ దగ్గరలోనున్న డీలరువద్ద తీసుకోండి. మీ ఎంట్రీలను జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, పోస్ట్ బాక్స్ నెం. 6531, బొంబాయి 26 ఎడ్రసుకు పంపండి. కవరుమీద 'పిల్లల ఫోటో పోటీ' అని వ్రాయండి.

* ట్రేడ్ మార్క్

JWTJJ 2575

తర్వాత యువానికా అంది, "నాకు మూడుఇవ్వకపోతేచచ్చిపోతా"అని.

"అలాగే చచ్చిపో, నాకేం ?" అన్నాడు యువాన్.

ఆమె వెంటనే కిందపడిపోయింది. యువాన్ ఏడుపు మొదలుపెట్టాడు. "అయ్యో! నా భార్య, నా యువానికా!" అని.

కొంతసేపు ఏడ్చిన తర్వాత వంగి భార్య చెవిలో ఇలా అన్నాడు. "యువానికా, నీ పంతం చాలించు! నీకు రెండు నాకు మూడు !"

"అదేం వీల్లేదు ! మూడిచ్చావా సరే, లేదా నన్ను పాతెయ్యి," అంది యువానికా,

ఇక తనభార్య బతకనంటోందని గ్రహించిన యువాన్ తన స్నేహితుడి ఇంటికి వెళ్లాడు. అక్కడనుంచి ఇంకా నలుగురు స్నేహితులింటికి వెళ్లి అందరితోనూ తనభార్యని

# అయిదు గుడ్లు

పాతెయ్యటానికి సహాయపడమని కోరాడు. తనదగ్గర ఒక సెంటు కూడా లేదు. కాబట్టి ఏదయినా డబ్బు అప్పుగా ఇస్తే ఒక 'పేటిక' కొంటానన్నాడు. 'దానికేముం' దన్నారు స్నేహితులంతా.

యువాన్ ఇంటికి తిరిగి వచ్చాడు. భార్య ఇంకా చచ్చిపోయినదాని లాగే పడుకుని ఉంది. అతనికి ఏడుపు ఆగలేదు. కొంతసేపు ఏడ్చి, మళ్ళీ ఆమె చెవిలో ఊదాడు: "నాకు మూడు గుడ్లూ, నీకు రెండు!" అని.

"వీల్లేదు !" అంది యువానికా.

"అయితే పాతేస్తా !" అన్నాడు యువాన్.

"ఏమయినా చేసుకో నీ ఇష్టం !" అంది యువానికా.

కొంతసేపు తర్వాత ఆమెనిఒక (శవ) పేటికలో ఉంచి స్మశానానికి తీసుకుపోయారు యువాన్, అతని మిత్రులూ. దారిపొడుగునా యువాన్ భార్యకోసం ఏడుస్తూనే ఉన్నాడు. ఒకచోట అందరినీ ఆపి, భార్యని ముద్దుపెట్టుకుంటున్న మిషతో చెవిలో రహస్యంగా అన్నాడు. "మూడు నావీ, రెండు నీవీ!"అని.ఆమెజవాబు మాటనేలేదు.

స్మశానానికి చేరారు. పేటికని గోతిలోకి దింపేముందు "ఇదిగో నిన్ను పాతెయ్యబోతున్నాం" అన్నాడు ఆమె చెవిలో. ఇక నిజం చెప్తున్నాడని గ్రహించిన యువానికా లేచి కూర్చొని, "సరే అయిదూ నువ్వే తీసుకో !" అంది

అందరూ తమ తమ ఇళ్లు చేరుకున్నారు.

యువానికా బల్లమీద అయిదు గుడ్లూ పెట్టింది—కాని వాటిల మూడు తనే తినేసింది!



వారం రోజులు అందరూ సరదాగా గడిపేరు. వెళ్ళే రోజుకి ముందురోజు సారథి రావుతో "బోలెడు గొప్పలు చెప్తావుకాని రాకరాక వచ్చిన బావమరిదిని సన్మానించడానికి ఓ పార్టీయేనా పెట్టేవుకాదు" అన్నాడు నిరుత్సాహంతో కూడినవాడై.

"అయ్యో! అంత మాత్రానికే చిన్నబుచ్చుకోవాలా? మాట మాత్రం అంటే పార్టీలేం ఖర్మ, డిన్నర్లూ, డ్యాన్సు ప్రోగ్రాములూ అరేంజి చెయ్యక పోయానా? పోన్లే. రేపు నలుగుర్ని పిలిచి భోగి పళ్ళు పోయిస్తానుండు" అన్నాడు రావు వోదారుస్తూ. అన్నట్టుగానే నలుగుర్ని పిలిచాడు. అందరూ కబుర్లు చెప్పుకుంటూ లత చేసిన స్పెషల్స్ ఖర్చు చేస్తున్నారు.

ఇంతలో పక్క గదిలోంచి ఉఫ్‌మని, గీమని శబ్దం వచ్చింది. "శ్రోతలారా! ఇప్పుడు మీరు వీధినాటకం వింటారు. . . . . ."

లత సారథివేపు తిరిగి, "ఎడ్వెర్టైజ్‌మెంట్సు కావాలన్నావు" అంది.

"ఋక్కుర్లేదు కాబోలయితే" అన్నాడు సారథినవ్వి.

". . . . . .ఇప్పుడు మీరు లతారావుగారి కచేరి వింటారు." అని రావు గొంతు వినిపిస్తోంది.

"లతారావు ఏమిటి? మీరు కూడా వాయిస్తారా?" (లత గొంతు)

"సరే. లతాదేవిగారు ఇప్పుడు జంట స్వరాలు వాయిస్తారు" (రావు)

"నేను కృతి వాయిస్తాను" (లత గొంతు)

"సరే. లతాదేవిగారు ఇప్పుడు "చలమేల చేశావు" అనే కృతి వాయిస్తారు. దర్బార్ రాగం. ఆది తాళం" (రావు గొంతు)

"అది కృతికాదు. వర్ణం" (లత)

"అయ్యో! ఇంతసేపూ జరిగింది నాటకం. ఇప్పుడు శ్రీమతి లతాదేవిగారు వాయించేది వీణ." (రావు)

ఒక్క క్షణం నిశ్శబ్దం.

"సా......పా......సా......"

"అదేమిటి?" (రావు)

"మా మేష్టారు చెప్పారు ముందు సాపాసా వాయించమని" (లత)

"కానియ్" (రావు)

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

మళ్ళీ టింగ్... టింగ్... టింగ్... అని వినిపిస్తుంది కొంచెంసేపు.

"ఆపేశావేం?" (సారధి)

"ఇప్పుడు వైలనిస్టు ఛాన్సు" (లత)

"అదెక్కడ తేవడం. అనకాపల్లి నూకాలమ్మ జాతరలో నా మేనల్లుడు కొన్న డప్పులబండి ఉంది కావలిస్తే." (రావు)

"అన్నయ్యా! పకోడీలలో జీడిపప్పు వెయ్యనా, ఉల్లిపాయ లెయ్యనా?" (లత)

"దిట్టంగా పచ్చి మిరపకాయలు వెయ్యి— జన్మలో మర్చిపోకుండా." (రావు)

కొన్ని క్షణాల నిశ్శబ్దం.

"ఆరుద్ర రచించిన 'దేవుని ఎదుట' నాటిక వింటారు. కవి కుమారుడి ఆత్మ ఘోష వినండి" (రావు గొంతు)

సారథి గొంతు వినిపిస్తుంది. "నా యిష్టం. నా ఇష్టమొచ్చినట్టు వ్రాస్తా. నా కళ్ళ కేది కనబడితే దానిమీద రాస్తా. ధనరాసుల ప్రక్క దారి

# ఉద్దేశాలు మంచివే!

21 వ పేజీ తరువాయి

ద్ర్యం—సుజ్ఞానపు క్షేత్రంలోనే అజ్ఞానపు బ్రహ్మ జెముడు డొంకలు, ఆ ప్రక్కనే నిరాశ—ఆనందం ప్రక్కనే ఆక్రందనం— అడుగడుగునా విఘ్నాలు ఆశలకు అవాంతరాలు—ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలకు చన్నీళ్ళు— అభిప్రాయాలకి సంకెళ్ళు ఆలోచనలకి బేడీలు— ఆదర్శాలకి ఉరితాడు, ఉత్సాహానికి కంట్రోలు, ఉద్రేకాలకి రేషను—ఇహంలో నో వేకెన్సీ—పరంలో నో ఎడ్మిషన్—కళ్ళకు కటకటాలు కడుపులోకి కంకర, తలరాతలు వంకర. . . . .

"టింగ్. . . . .టింగ్. . . ." మళ్ళీ వీణ విన్పిస్తుంది.

రావు గొంతు "సరిమాపద. . . . సరిపద. . ." పదా. . . . . . .పదా. . . . . ."

సారథిగొంతు "ఎక్కడికోయ్?"

. . . . . . . . . . . . .

లత వెళ్ళి గుప్ చప్‌గా మెయిన్ స్విచ్ ఆఫ్‌చేసి రావడంతో ఆ భాగవతం పరిసమాప్తమయింది. అతిథులంతా వెళ్ళిపోయాక "నాకు తెలీకుండా నేను మాటాడినవన్నీ రికార్డు చేశారుకదూ!" అంది పరిదీనవదనయ్యై.

"ఏం వైపోయిందిప్పుడు?" అన్నారు ఇద్దరూ నవ్వి.

ఆ మాటకొస్తే లత వాయించిన వాయింపుల మధ్యలో 'యిరేస్' చేసి రావు వాయించేడని లతకి తెలీదు కనక అడగలేదు.

మర్నాడంతా లత చాలా ముభావంగా ఉంది. దానికి కారణం ఆ సాయంత్రం లత రావుని "నిజంగా నా వాయింపు అంత ఘోరంగా ఉంటుందండీ?" అని అడిగేవరకూ తెలీలేదు. రావుకి జాలేసింది. నిజం చెప్పేద్దాం అనుకున్నాడు. కాని నిజం చెప్తే తన కార్యం సాఫల్యంకాదని జ్ఞాపకం వచ్చింది.

"అబ్బే, మరీ అంత యిదిగా ఉండదనుకో. నువ్వింకా ఎమెచ్యూర్‌వి కదా. అందుచేత. . . ." అన్నాడు దేశీయ తటస్థ విధానాన్నవలంబిస్తూ.

"అవునవును. ప్రాక్టీసు చాలదు. ఇంకా బాగా ప్రాక్టీసు చెయ్యాలి" అంది లత.

పాపం! రావు అవాక్రృతిభుడై పోయిన సంగతి లత చూడనేలేదు. ద్విగుణీకృతోత్సాహంతో లత స్వర్ణల ప్రాక్టీస్ సాగిపోతూంది. ఆనాటినుంచి. ఆ వీణల కల కలలే ఆ రోడ్డున వినిపించే గర గరలు.

కావలిస్తే కాలేజి రోడ్‌మీద సాయంసమయంలో షికారుగా వెళ్ళి చూడండి సూర్య చంద్ర లారీ సర్వీస్ షెడ్స్ ఇప్పటికీ కనిపిస్తూనే ఉంటాయి!! ★

"బ్రదర్! నా మాట విను నాలాగే నువ్వు కూడా ఓ పడుచు పనిమనిషిని యింట్లో పెట్టు. మీ ఆవిడ నువ్వు పొమ్మన్నా మరి నిన్ను వొదిలి సినిమాలకేగాదు బజారుకేనా వెళ్ళదు."




తులసికోటను కడిగి ముగ్గులు పెడ్తూంది శారద. తలంటి పోసుకుందేమో వెంట్రుకలు వదులుగా భుజంమీదుంచి ముందుకు పడుతున్నాయి. ప్రశాంతత, భక్తిభావం అందంగావున్న ఆమె ముఖానికి ఇంకా అందాన్ని ఇస్తున్నాయి.

ప్లాస్టిక్ బుట్టలోంచి పళ్లెంలోకి పూలు పోస్తుంటే చటుక్కున రమ గుర్తొచ్చింది శారదకు. రమ శారదకు పెద్దమ్మ కూతురు. ఇద్దరిది ఇంచుమించు ఒకే వయస్సు.

ఓరోజు తను వాళ్లింటికి వెళ్లేసరికి పూల పందిరి కర్రలు పీకుతోంది రమ. "అదేం పనే ముద్దూ" అంది తను వెనక నిలబడి.

"కర్రలకు చెద పడుతోందే! అందుకని" అంది రమ కూచుని చెదను పుల్లతో గీకుతూ.

వంగి రమ బుజాల మీద చేతులేసి "చెదను తీసేయాలి కానీ పందిరి లాగేస్తే చెట్టు కుప్ప కింద కూలి పోదా" అంది తను విరగ పూసిన చెట్టును చూస్తూ.

"వేరే పందిరి వేసుకొందాం" అంది రమ తల పైకెత్తి.

"నా మొహం లాగుంది అల్లుకు పోయిన తీగ అంతా ఊడ తీస్తావా."

దాని స్వభావమే అంత అని నవ్వుకుంది శారద. ముందుకు పడిన వెంట్రుకలు వెనక్కి తోసి దీపారాధన వెలిగించి పూజలో నిమగ్నురాలైంది.

పూజ ఆమె దినచర్యలో ఒక భాగం. పెళ్లికాక ముందు అమ్మ పూజ చేస్తుంటే పక్కనే కూచునేది. ఆమె దృష్టిలో తులసి చెట్టు చెట్టు కాదు. ఒక సజీవ దేవత. కష్టాల్లోనూ సుఖాల్లోనూ తనకు అండగా నిలుస్తుందని ఆమె నమ్మకం.

భగవంతుడున్నాడో లేడో ఆయనకే తెలియాలి. కాని పరిస్థితులు ప్రతికూలంగా వున్నప్పుడు ఏదో దివ్యశక్తి చేయూతనిచ్చి కష్టాలనుంచి గట్టెక్కిస్తుందని నమ్మకం వుంటే ఎంతో మనోబలం వస్తుంది. కష్టాల నెదుర్కోడానికి అది ఎంతైనా అవసరం.

**ఉత్తరాలతో వచ్చిన పోస్టుమన్ ఒక కవరు లోపలికి గిరవాటేసి వెళ్ళిపోయాడు.**

పూజ ముగిసింతర్వాత పూజా సామగ్రి లోనికి తెస్తుంటే కవరు కన్పించింది. చెయ్యి తుడుచుకొని వంగి కవరు తీసుకొంటున్న శారద రమ దస్తూరిని గుర్తించింది. పూజ పళ్ళెం వంటింట్లో పెట్టి కవరు చింపుతూ వచ్చి మంచం మీద కూర్చుంది. పక్కన పాపాయి నిద్ర పోతోంది. పాపకు కప్పివున్న దుప్పటి సర్ది ఉత్తరం చదవటం మొదలు పెట్టింది.

**" డియర్ శారదా,**

ఇక్కడ నేనూ అమ్మా నాన్నా క్షేమం. ఏం ఆశ్చర్యపడుతున్నావా ? అవును. పుట్టింటినుంచే జాబు రాస్తున్నాను. వచ్చి రెండు నెలలయింది.

డబ్బుతో సుఖ సంతోషాలను కొనుక్కోలేమని ఇన్నాళ్ళకు తెలిసొచ్చిందే శారదా. అవి మనసుకు సంబంధించినవి. బజార్లో దొరకవు.

మనం ఎస్. ఎస్. ఎల్. సి. చదివేప్పుడు ఈ విషయమే ఎగతాళిగా మాట్లాడాను పిన్నితో గుర్తుందా ? "

శారద మనస్సు ఒక్కసారి ఆరేళ్ళ వెనక్కు మళ్ళింది.

రమ వచ్చేప్పటికి ఆరోజు పూజ అయిపోయింది.

" శారదకు చక్కటి మొగుణ్ణి ప్రసాదించు తల్లీ " అని అమ్మ దణ్ణం పెడ్తూంటే తనూ భక్తిగా నమస్కరించింది.

వీళ్ళెం మనుష్యులూ అన్నట్లు రాబోతున్న నవ్వును ఆపుకుంటూ ముందుకు పడి వున్న జడను ఒక చేత్తో లాగి పట్టుకొని చూస్తూంది రమ.

" హారతి అద్దుకుని దణ్ణం పెట్టుకో రమా, తులశమ్మను నమ్ముకొంటే సుఖ సంతోషాలకు లోటుండదు " అంది అమ్మ.

జడను వెనక్కి విసిరి హారతి అద్దుకొని చేతులు చాపింది ప్రసాదం కోసం " దణ్ణం పెట్టు కోక పోతే సుఖం సంతోషం వుండవా పిన్నీ " అంది రమ.

" అలా అనగూడదు తప్పమ్మా " అంది అమ్మ.

" ఈ కాలంలో అంతా డబ్బు పిన్నీ. డబ్బుంటే సుఖ సంతోషాలకు కొదవేమిటి ? అంతేగాని మంత్రాలకు చింతకాయులు రాల్తాయా" అంది ప్రసాదం అందుకుంటూ రమ. "శారదా, పత్రిక చదవడం అయిపోతే ఈవే, సీరియల్స్ కత్తిరించుకోవాలి."

పత్రిక ఇవ్వడానికి తను వెళ్తుంటే తనతోపాటు వచ్చింది రమ. ఏదో మెల్లగా మొక్కుకొంటోంది అమ్మ.

రమ పట్టు పరికిణీలు, నైలాన్ వోణీలు కట్టి దండ వేసుకొని ఎప్పుడూ సరదాగా గలగలలాడు తుండేది. తను చీటీ పరికిణీలు, చిసిగిన వోణీలు, తోసి మెడలో వుండేది రమ నాన్నగారు మొదట్లో ఏదో షాపులో గుమాస్తాగా వున్నా మెల్లిగా చిన్నకొట్టు పెట్టి న్యాయం అన్న పదాన్ని తన డిక్షనరీ లోంచి తీసేసి రెండు చేతులా ఆర్జించి పదిహేనేళ్ళలో ఒక పెద్ద ఇల్లు కట్టేశాడు ప్రస్తుతం వాళ్ళకు ఐదు షాపులున్నాయి. రమకు తోబుట్టువు లెవరూ లేరు. నాన్నగారు న్యాయం ధర్మం అంటూ పదిహేనేళ్ళనుంచి అలాగే ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంట్‌లో క్లార్కుగా వున్నారు. **తనకు ముగ్గురు తమ్ముళ్ళు.**

ఆలోచనల నుంచి తేరుకొని మళ్లీ ఉత్తరం చదువ సాగింది శారద.

" డబ్బుంది. అందం వుంది. నాకేం తక్కువ అనుకొనేదాన్ని. బియ్యే ప్యాసయిం తర్వాత— చదువు కూడా వుంది. ఇంకేం అనుకొనేదాన్ని. ఎస్. ఎస్. ఎల్. సి. తో నీవు చదువుని నిలిపేసి నాలు గేళ్ల తర్వాత ఒక టీచరును పెళ్ళి చేసుకొన్నప్పుడు అనుకున్నాను. నాకేం చక్కటి భర్త లభించాడు. శారదకు చదువూ లేదు, టీచర్ పెళ్ళాం. దాని జీవితం ఎట్లా తెల్లవార్తుందో అని."

శారద మళ్లీ ఆలోచనలో పడింది. సినిమాలో లాగ గతం ఆమె కళ్ళముందు కదుల్తోంది.

ఆర్థిక పరిస్థితి బాగు లేక తను ఎస్సెల్సీతో చదువు నిలిపేసింది. తనకు కాలేజీలో చదువుకోవాలని ఎంతో ఆశ. రమ కాలేజీలో చేరింది. దాన్ని అడిగి కాలేజీ విషయాలు చెప్పించుకొనేది. హైస్కూలు వరకూ సామాన్యంగా వున్న అమ్మాయిలు కూడా ఆధునికంగా అలంకరించుకొని కిలకిలా నవ్వుతూ వెళ్తుంటే కిటికీవూచలు పట్టుకొని చూస్తోంది తను ఒకరోజు. అప్రయత్నంగా తన దురదృష్టానికి కన్నీళ్ళు తిరిగాయి. వెనక ఏదో శబ్దమయే సరికి తిరిగి చూసింది. అమ్మ! పైగా తనవైపే చూస్తోంది " కంట్లో ఏదో పడిందే " అంటూ తను సందులోకి వెళ్తుంటే అమ్మ నిట్టూర్చింది.

నాన్నగారు సంబంధాలు వెతకడం మొదలెట్టారు. ఏ సంబంధమూ కుదరలేదు. అది లేదంటే ఇది లేదనే వారు.

ఒక సారి పెళ్లి కొడుకు వచ్చి చూసి పోయాడు. తనకు నచ్చలేదు. అయినా ఏమీ చెప్పలేకపూరుకుంది. సాయంత్రం వాళ్ల మనిషి వచ్చాడు. నాన్నగారు పడక కుర్చీలో కూర్చొనున్నారు. అమ్మ గబగబా ఆత్రంగా వెళ్లింది. ఏం చెప్తాడోనని. తను తలుపు చాటున నిల్చుంది. ఏడేళ్ల తమ్ముడు రవి మంచం మీద కూర్చుని గట్టిగా పాఠాలు చదువు తున్నాడు.

ఆయన చల్లగా చెప్పాడు: "అబ్బాయికి అమ్మాయి నచ్చలేదట. చూస్తూంటే సీతా, సావిత్రి గుర్తొస్తూందట. గ్లామర్ బొత్తిగా లేదట."

నాన్నగారు తారాజువ్వలా లేచారు. గ్లామర్ అంటే ఏంటో తెలియని అమ్మ అర్థంకాక చూస్తూంది. బహుశా గ్రామర్‌లో తన కూతురు ఫస్ట్‌మార్కులు తెచ్చుకొన్న సంగతి గుర్తు వచ్చి వుంటుంది.

" తూ. వెధవ వాడు తనకై వచ్చి చేసుకొంటా నన్నా నా అమ్మాయిని ఇవ్వను. పొమ్మను " అన్నారు నాన్న. ఆయన కోపంతో అంతా నిశ్శబ్దం అయింది. రవి పాఠం స్పష్టంగా వినిపిస్తూంది. " ద్రాక్ష పండ్లు పుల్లగానున్నవని నక్క........ "

" వెధవా. చదువు కట్టిపెట్టి అవతలకుపో " అరిచారు నాన్న. తనకు నవ్వు వచ్చింది మంచం మీద కూర్చుంటుంటే రవి బిక్కమొహంతో వచ్చాడు

" ఎందుకక్కా నాన్న కోప్పడ్డారు." అన్నాడు మెల్లగా.

" సాయంకాలం వేళ ఏదవ కూడదు. దీపాలు పెట్టాక చదువుకో " అంది వాడి క్రాపు సవరిస్తూ.

ఇలాగే అయ్యేవి సంబంధాలన్నీను. నాలుగేళ్లు గడిచిపోయాయి. రమ బియ్యే ప్యాసయింది. తన పెద్ద తమ్ముడు ఎస్సెల్సీ ప్యాసయాడు.

ఓ రోజు మధ్యాహ్నం తిరిగ్గా అమ్మ చాపమీద పడుకోనుంది. నాన్నగారు ఈజీ చైర్‌లో కూర్చుని మోహన్‌తో మాట్లాడుతున్నాడు. నాన్నకేమో వాడిని పాలిటెక్నిక్‌కు పంపేస్తే బాగుండునని. వాడికేమో పి. యు. సి. చదవాలని.

తను వెళ్లి అమ్మ కాళ్ళదగ్గర చాపమీదకూర్చుంది.

" వాడు తెలివిగలవాడు నాన్నా. బి ఇ. కి పంపిద్దాం."

" చదివించ గల శక్తి ఉండక్కర లేదమ్మా " అన్నారు నాన్న.

" ఎట్లో తిప్పలు పడ్డాం. వాడో ఇంజనీరయితే మిగతా వాడు పెద్ద చదువులు చదవ్వచ్చు; వాడూ 150 రూపాయలు తెచ్చుకుంటూంటే ఇంకేం పంపుతాడు."

నాన్నగారు నవ్వారు.

" ఇంజనీరయింతర్వాత డబ్బు పంపి అందర్నీ ఉద్ధరిస్తాడని నీ ఆశా ? "

" మోహన్ బంగారుకొండ. తప్పకుండా ఆదు కొంటాడు." అంది అమ్మ లేచి కూర్చుంటూ.

" అట్లే అనుకొంటూండు. ఈ కాలంలో ఆడపిల్లలూ, మగపిల్లలూ ఒకటే. ఐదారు వేలు పోసి శారదను ఒక అయ్య చేతిలో పెడ్తాం. ఆనాటినుంచి పరాయి పిల్ల. అలాగే ఐదారు వేలు పోసి వీణ్ణి ఇంజనీరు చేసి ఓ అమ్మ చేతిలో పెడ్తాం. ఆనాటి నుంచి తనూ, తన సంసారం అంతే."

" అదేమిటి నాన్నా " అంది తను.

" వాడికి మనమీద ప్రేమ లేక కాదు. అదంతే. 4, 5 వందలు తెస్తున్నాడనుకో. అంత సంపాయించే వాడింట్లో రేడియో లేక పోవడం అంతస్థుకు లోప మనిపిస్తుంది. కొంటాడు. కొనేప్పుడు ఈ డబ్బే ఇంటికి పంపితే సంవత్సరం పాటు తమ్ముళ్ళకు గుడ్డలకు పనికొస్తుందని ఆలోచన వస్తుందంటావా?

" వాడి పెళ్లాం సాదా చీరలు కట్టుకుందనుకో— ఏమంటారు. నీవు మాసికలు వేసిన చీర కట్టినా బాధుండదు. నీవో క్లర్కు పెళ్లానివో, టీచర్ పెళ్లా నివో అవుతావు కాబట్టి. 4, 5 వందలు తెచ్చే వాడి పెళ్లాం నీలాగా చీరలు కడ్తే నీవే ఏమంటావు చెప్పు. మంచి చీరలు కొంటాడు. కొనేప్పుడు ఇంట్లో అమ్మ రెండే నేత చీరలతో గడుపుతోందని, చెల్లెలు ఇంతకు సగం ధరకల చీరలు కూడా ఏనాడూ కట్టలేదని ఆలోచన వస్తుందంటావా ? వచ్చినా పెళ్లానికి మామూలు చీరలు కొనగలడంటావా ?

" అన్నీ ఇంతే — పెళ్లానికి జబ్బు చేస్తుంది. ఇంజక్షన్లకూ, మందులకూ 50 రూ. లు అవుతాయి. ఆనెల ఇంకేదో ఖర్చు తగ్గించు కొంటాడు పెళ్లానికి మందిప్పించక్కర్లేదా ?

"అదే అమ్మకు జబ్బు అని రాశాననుకో నెలనెలా సరీగ్గా సరిపోతుంటే డబ్బు ఎక్కడి నుంచి పంప గలను అనిపిస్తుంది అంతే -- ఎవరిది తప్పంటావు. అమ్మా, నాన్నా, కొడుకు, కోడలూ, ఒకేచోట వుంటే ఒకళ్ల బాధలొకళ్లకు తెలుస్తాయి. లేకపోతే కోడ లొచ్చి నప్పట్నుంచి డబ్బు పంపటం లేదని అమ్మ, తను దుబారా చేయకుండా అంతస్థుకు లోపం రాకుండా గడుపుతూంటే డబ్బు డబ్బు అంటూంటా రని కొడుకూ అనుకొంటుంటారు. అంతే " అన్నారు నాన్న.

రమ బియ్యే ప్యాసయిన రెండు మూడు నెల్లల్లో

# జీవనలత

పెళ్లి నిశ్చయమయింది. ఆయన ఏదో కంపెనీలో మానేజరు. ఆస్తి బాగా వుంది. అమ్మా నాన్నా లేరు పెళ్లి వటాటోపంగా జరిగింది.

తర్వాత అనుకోకుండానే తనపెళ్లి నిశ్చయమైంది. ఆయన హైస్కూల్లో టీచర్. రమ భర్తతో సహా కారులో వచ్చింది తన పెళ్లికి.

తనను అత్తారింటికి పంపేప్పుడు "తులసి పూజ మాత్రం తప్పక చేస్తూండమ్మా" అంది అమ్మ.

"ఇంకా పోలేదా పిన్నీ నీ పిచ్చి నమ్మకాలు. ఏనాడూ గంటల తరబడి పూజ చేయక పోయినా నేను సుఖంగా వున్నాను. చిన్నప్పట్నించి పూజ చేస్తున్న శారదకు అయ్యవారు దొరికాడు" అంది రమ.

అమ్మ తన్ను దగ్గరికి లాక్కుని తలమీద గడ్డం ఆన్చి గొణుక్కుంది. "నా పిల్లకు ఇప్పుడేం తక్కువయిందమ్మా" అని.

పాప లేవడంతో భావనా ప్రపంచం నుంచి ఈ లోకంలోకి వచ్చింది. ఉత్తరం చదవకుండా ఇలా ఆలోచిస్తున్నానేమిటీ అనుకుని పాపని వళ్లోకి తీసుకొని పాలిస్తూ ఉత్తరం తిరిగి చదవడం మొదలెట్టింది.

* * *

"కొన్నాళ్ల వరకూ నా సంసారం సుఖంగానే గడిచింది. ఆయనదగ్గిర స్వర్ణలత అని స్టెనో-టైపిస్ట్ ఉండేది. మా ఇంటికి కూడా అప్పుడప్పుడూ వచ్చేది. మనిషి అందంగా వుంటుంది. ఇరవై, ఇరవై రెండేళ్లకు మించి ఉండవు. ఆయన క్యాంపులకు వెళ్తూంటే కూడా వెళ్లేదట.

పెళ్లయిన రెండు, మూడు నెలల వరకూ ఎక్కడికీ వెళ్లలేదు. తరువాత వెళ్తూండేవారు. మూడు నెలల క్రిందట ఓసారి మద్రాసు వెళ్లారు. స్వర్ణ కూడా వెళ్లింది. నేనూ సరదాగా వస్తానన్నాను. "మేమేమో రోజంతా బిజినెస్ మీద తిరుగుతూంటాము. నువ్వు ఒక్కదానివే హోటల్లో కూచోవాలి. అదీకాక నీవు చూశావుగా మద్రాసు" అన్నారు.

నాల్గురోజుల్లో వస్తామన్నవారు వారం రోజులకు వచ్చారు. పని పూర్తికాలేదట. ఆయన ఆఫీసుకు వెళ్లాక బెడ్డింగ్ విప్పుతున్నాను. చాకలికి బట్టలేయడానికి. దాన్లోంచి నాలుగు తలపిన్నులు పడ్డాయి. బట్టలు తీస్తుంటే ఒక స్లీవ్ లెస్ చోళీ వచ్చింది. బహుశా స్వర్ణది కాబోలు. చోళీ అంటే పొరపాట్న గుడ్డల్లో కలిసుండ వచ్చు. పిన్నులెట్లా వచ్చాయి? స్వర్ణ అందంగా ఆకర్షణీయంగా వుంటుంది. నన్ను రావద్దన్నారు మద్రాసుకు ఇందుకేనా?

ఆయన భోజనానికి వచ్చింతర్వాత వడ్డించి గడప మీద కూర్చుని అడిగాను. "స్వర్ణవి చోళీ, తల పిన్నులూ మీ హోల్డాల్‌లో వున్నాయండీ. తీసుకెళ్లమనండి" అన్నాను.

"చోళీ స్వర్ణదే. ఆమె బెడ్డింగ్ కట్టేసిం తర్వాత ఆరేసిన చోళీ కన్పించింది. మళ్లీ బెడ్డింగ్ విప్పుతూంటే 'ఎందుకులే మళ్లీ విప్పుతావు నాబెడ్డింగ్‌లో వేయి. తర్వాత తీసుకుందువు గాని' అన్నాను.

"జాకెట్ ఎందుకు ఆరేసిందండీ? తడిసిందా?"

"ఆమెకు వుండేవి రెండో మూడో మంచి జాకెట్లు. నాల్గురోజుల్లో వస్తామనుకున్న వాళ్లం వారం రోజులు పట్టి, నబ్బేసి ఆరేసింది."

"తల పిన్నులు కూడా వున్నాయండి!" ఒక్క నిముషం ఆలోచించారు.

"వచ్చేప్పుడు బండ్లో నా బెడ్డింగ్ మీద పడుకుంది. తలనొప్పిగా వుందని. అప్పుడేమైనా పడ్డాదేమో."

"మరి మీతోపాటు ఫస్ట్ క్లాసులోనే వస్తుందా ఎప్పుడూ?"

ఆయన విసుక్కున్నారు.

"ఏమిటీ నీ యక్ష ప్రశ్నలు. వేరే క్లాసులోనే వున్నది. ఏదో స్టేషన్లో దిగి కాఫీ తాగాను. ఆమె తలపట్టుకొని కూచోనుంది. చాలా రష్‌గా వున్నది. ఏమిటంటే విపరీతంగాతలనొప్పిఅని చెప్పింది. టికెట్ మార్పించి నా కంపార్ట్‌మెంట్‌లో ఎక్కించాను."

ఆయన సమాధానాలు తృప్తి నివ్వలేదు. రెండో మూడో చోళీలు మాత్రమే మంచివంటున్నారు. అంత పరీక్షగా చూస్తారా? తలనొప్పి అయితే మాత్రలు కొని ఇవ్వాలిగాని, అంత డబ్బు పోసి ఫస్ట్ క్లాసులోకి మార్పించి తన బెడ్డింగ్ పరచి పడుకోమంటారా? తూ! అబద్ధం.

ఆయన ఆఫీసు నుంచి ఫోను చేశారు. స్వర్ణ అమ్మకు చాలా జబ్బుగా వుందని స్వర్ణ రాలేదనీ, జాకెట్ ప్యూన్ చేత పంపించమనీ.

స్వర్ణను గూర్చి ఆలోచిస్తూ కూచున్నాను.

ప్యూన్ వచ్చాడు. వీణ్ణడిగితే సరి? "ఏం రామయ్యా! స్వర్ణకు ఈ జాకెటు, పిన్నులు ఇచ్చెయి" అంది.

వాడు మడత పెట్టి తీసుకొంటూంటే "స్వర్ణ ఇంట్లో వుంటుందా? ఎక్కడికైనా పోయుంటుందా" మొదటి ప్రశ్న క్రింద అడిగాను.

"ఎక్కడికి పోదమ్మా. అందులో ఆరి అమ్మగారు జబ్బుగా వుందట. ఎప్పుడూ గూడా ఆఫీసు, ఆఫీసు తప్పితే ఇల్లు. ఇంట్లో అమ్మకూ, పాపాయికీ సేవ చేసే సరికే ఆమె పని అయిపోతుంది."

"పాపాయెవరూ" షాక్ తిన్నదాన్లా అడిగాను. "స్వర్ణకు పెళ్లయిందా?"

"మంచోళ్ల కెప్పుడూ కష్టాలేనమ్మా. కడుపులో పడ్డ మూడు నెల్లకు కలరావచ్చి మొగుడు పోయాట్ట. తల్లి, ఆనా. ఎవరూ లేరు ఇక్కడికొస్తే ఏదన్నా వుద్యోగం దొరుకు తుందని వచ్చింది. టైప్ నేర్చుకొని బాబుగారి దగ్గర చేరిందమ్మా. బాబుగారు దయతల్చి ఉద్యోగం ఇచ్చారు. చక్కగా పని చేస్తుంది."

పాపాయి! స్వర్ణ మొగుడిని వీళ్లెవరూ చూడలేదు. ఉద్యోగంలో చేరింతర్వాత పాపాయి పుట్టింది. కొంపదీసి ................

అంతేనే శారదా, ఆరోజునుంచీ అన్నీ అనుమానాలే. ఆయనకు నా అనుమానాలు తెలీదు. మామూలుగా వున్నారు. నాలో అగ్ని పర్వతం రగుల్కొంది.

ఒకరోజు చెప్పేశాను. "స్వర్ణను పనిలోంచి నిలిపేయండి."

ఆయన ఆశ్చర్యపోయారు.

"ఏం" అన్నారు. ఏమనాలో తోచలేదు. "మంచిది కాదట" అన్నాను. "చెప్పిన వాళ్ల కళ్లు పోతాయి."

"నా కిష్టం లేదు. నిలిపేయండి" అన్నాను. నిశ్చయంగా.

"నీకిష్టం లేకపోతే? పని చేయించుకొనేది నీవు కాదుగా" అన్నారు నవ్వుతూ.

ఒళ్లు మండింది.

"అదంటే అంత ఇష్టమయితే దాన్నే పెళ్లాడక పోయారూ?"

రెండు నిముషాలు అలాగే చూశారు. చెయ్యి కడిగేసుకొని లేచి వచ్చేశారు.

ఆఫీసుకు వెళ్తూ వెళ్తూ "నీ కిష్టం లేకపోతే అలాగే నాలుగైదు నెలల్లో కొత్త స్టైనో దొరకగానే నిలిపేస్తాను" అన్నారు మెల్లిగా. అప్పట్నుంచి ఏ మాటన్నా చెడు అర్థం స్ఫురించేది. ఏం చేసినా అనుమానం వచ్చేది. ఒక నిశ్చయానికి వచ్చేశాను.

నాలుగు నెలలయింది. అయిదు నెలలయింది. స్టైనో మారలేదు. ఆయన నన్ను మోసం చేశారనుకొన్నాను.

"కొత్త స్టైనో దొరకలేదా?" అన్నాను ఒక రోజు ఆయనకు కాఫీ ఇచ్చి.

"లేదే. తెలివితేటలూ, అణకువా ఉండే వాళ్ళు దొరకడం కష్టం. అదీకాక వాళ్ళమ్మకు చాలా జబ్బుగా ఉందే. ఇవాళో రేపో అన్నట్లుంది ఉద్యోగం నుంచి తీసేస్తే గోలయి పోదూ.

"అసలు రమా! నీ అనుమానానికి ఆధారం లేదే. ఒట్టు పెట్టి చెపుతున్నాను. గతిలేని దశలో స్వర్ణవస్తే ఉద్యోగమిచ్చాను. చెల్లెలి క్రింద మాను కొన్నాను." అన్నారు.

"కల్లిబొల్లి మాటలు చెప్పి ఒట్టు పెట్టి స్వర్ణను ఉంచేసుకుందా మనుకొంటున్నారు." అంది నాలోని మనసు.

లెఫ్టినెంట్ కొత్త సైనికులతో: మీ కామ్రేడ్ లంతా మీ సోదరుల వంటివారు నేను మీకు తండ్రిలాంటి వాడిని. ఏమంటారు?

కొత్తగా చేరిన సైనికుడు: అవును నాన్నగారూ!

ఎ. కృష్ణయ్య (మద్రాసు)

"ఏం బాధగా ఉందా స్వర్ణను వదల్గానికి?" అన్నాను.

ఆయన విసుగ్గా "వాళ్ళమ్మ చావు బతుకుల్లో ఉంది. ఉద్యోగం తప్ప దిక్కులేదు. పైగా చక్కగా పనిచేసేది. ఒక్క పొరపాటూ చేయలేదు. ఉత్త పుణ్యానికి నిలిపేయాలంటే బాధకాదూ" అన్నారు.

నాలో దెయ్యం ఆవేశించింది.

"అవున్లెండి వన్నెల విసరకర్ర లాంటి స్వర్ణనూ, కన్న పాపనూ పొమ్మని ఎలా అనగలరు." అన్నాను.

భీకరంగా అరిచారు. గజగజ లాడిపోయాను. కాఫీగ్లాసు నా మొఖాన కొట్టి వెళ్ళారు.

ఆఫీసు ప్యూన్ చీటీ తెచ్చాడు.

"నీవు చదువుకొన్న దాని వనుకొన్నాను. అంత నీచంగా మాట్లాడుతావనుకోలేదు. ఒట్టు పెట్టు కొన్నా నమ్మలేదు. నీ ముఖం చూడ్డానికి మనస్సొప్పటంలేదు. నీలాగా నీచంగా ఆలోచించే వాళ్ళతో సంసారం చేయడం కష్టం.

"స్వర్ణ నిష్కల్మష. ఓ పది రోజులలో తిరిగి వస్తాను. నీవు చేసిన పని ఆలోచించుకో. నీ కాపురాన్ని నీవే నాశనం చేసుకొంటున్నావు. బాగా ఆలోచించు.

"స్వర్ణకు ఈ సంగతి తెలియనీకు. వాళ్ళమ్మ ఈవేళే పోయిందట. ఏడుస్తూ దిగులుగా ఉందట."

కోపం స్వర్ణ మీదికి మళ్ళింది. ఆయన వెళ్ళిపోతే నేనేమయి పోతానూ అనిలేదు. దాన్నసలు ఎందుకు నిలుపగూడదూ? ఇక్కడ గాకపోతే ఇంకో ఉద్యోగం దొరకదా? నాలుగైదు నెలల వరకూ దొరక్కపోతే మాత్రం? కట్టుకొన్న పెళ్ళాం ఎక్కువా? స్టైనో బాగోగులు ఎక్కువా? భగభగ మండి పోయాను. స్వర్ణ ఇంటికి వెళ్ళాను. నీచురాలివి అన్నాను. నా సంసారం నాశనం చేశావన్నాను. కులట వన్నాను. ఏదేదో అన్నాను.

రెండోరోజు పొద్దున్నే ఆఫీసు ప్యూన్ పరిగెట్టుకొచ్చాడు. "అమ్మా! స్వర్ణమ్మ పాపతో సహా బావిలో పడిందమ్మా, అమ్మ పోయిందని దిగులు కాబోలు."

నిశ్చేష్ట నయ్యాను. ఆ తోటే పోస్ట్‌లో ఉత్తరం వచ్చింది.

"ఈ జాబు మీకందేసరికి నేనూ పాపా ఈ సుఖ ప్రపంచం నుంచి వెళ్ళిపోయుంటాం. మా ఆయన పోగానే నా బతుకు శూన్యమయిపోయింది. కన్న తల్లిని అందులోనూ వృద్ధురాల్ని గాలికే వదిలేయలేక బ్రతుకుతూ ఉన్నాను. లేకపోతే ఆయనతో పాటే నేనూ స్వర్గానికి పోయేదాన్ని. అమ్మ పోయింది. నేను బ్రతికి సాధించిందేమిటి. మీ కాపురంలో కలతలు రేకెత్తించాను. ఎంత ఒట్టు పెడితే అంత. ఆయనను అన్యాయంగా చూశాను. వదినా, అన్నయ్యను క్షమాపణ కోరుకొని నీ జీవితం చక్కదిద్దుకో తల్లీ. స్వర్ణ".

భూమి గిరగిరా తిరుగుతున్నట్లయింది. ఆయన వస్తే క్షమార్పణ కోరుకోవాలి. క్షమిస్తారా! పది రోజులయింది. పదిహేను రోజులయింది. ఇంటి ముందు కారు ఆగేసరికి పరుగెత్తాను. ఆయన కాదు. నాన్నగారు!

"ఏం అమ్మా ఇలాగున్నావు? ఏమయిందమ్మా" అన్నారు పిచ్చిగా చూశాను. అంతా చెప్పాను. "ఇంటికి రామ్మా నాలుగు రోజు లక్కడ ఉందూ కాని, అల్లుణ్ణి కొంత పరచి నే తెస్తాగా" అన్నారు ఇంటికొచ్చేశాను. మొన్నమొన్న తెలిసింది నాన్నగారు అక్కడికి రావడానికి కారణం ఆయన ఉత్తరం అని. అది ఎలాగో సంపాయించి చదివాను.

"మిమ్మల్ని మామగారని సంభోదించడానికి సిగ్గుగా ఉంది. మీ అమ్మాయి మనిషికాదు. రాక్షసి. రెండు ప్రాణాలు తీసిన హంతకి. ఒక ప్రాణిని దుఃఖ పెట్టిన నీచురాలు. నేను రిజైన్ చేసి వెళ్ళి పోతున్నాను. మీ అమ్మాయిని కావాలంటే వచ్చి తీసుకెళ్ళండి."

ఆయన వచ్చి సంగతి తెలుసుకొని రిజైన్ చేసి వెళ్ళిపోయారన్నమాట. ఇంటి కొచ్చింటే కాళ్ళమీద పడేదాన్ని.

ఏం చెయ్యనే శారదా. నా జీవితానికి ఆధారంగా పాతిన పందిరికి చెద పట్టిందని పెరికివేశాను. నేనే కుప్పలా కూలిపోయాను."

"ఏం చేయాలో తెలీని రమ." శారద కన్నీళ్ళు జలజలా రాలాయి. పాపతోసహా తులసి కోట ముందు మోకరిల్లింది. "అమ్మా రమను క్షమించి దానికో దారి చూపించు తల్లీ" అంటూ ప్రార్థించింది.

★




ముప్పాళ రంగనాయకమ్మ

### జరిగిన కథ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికికూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంతవూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు.

## 7

సీతాపతి చూపించిన చోటల్లా చక చకా తవ్వి పారెయ్యటం—గంపలతో మట్టిరాసులెత్తి మోస్తూ పల్లాలు మెరక చెయ్యటంతో ప్రారంభమైంది తోటపని. చేసింది ముగ్గురే అయినా ఆ పూట చాలా దిబ్బలు పల్లాల్లోకి నడిచాయి. పని బాగా సాగింది.

సూర్యుడు సరదా పడి పైకి లేచి వస్తున్నాడు. "నేను చెప్పినట్టు గొయ్యితీసి ఇక ఈ పూటకి పని ఆపండిరా!" అన్నాడు సీతాపతి ఇంటికేసి వెళ్తూ.

"బాబాయి వెళ్ళిపోయాడురా! మనమూ పోదాం. గొయ్యి రేపు తీద్దాం లెద్దూ! ఆకలేస్తోంది." విసుక్కున్నాడు మదనగోపాలం

"రేపు ఇంకోపని— గొయ్యి తియ్యటం ఎంత సేపుదా! మీరు తవ్వండి. నేను మట్టి తీసేస్తాను" ఉత్సాహం కనపర్చాడు మధు. మధుకి కూడా ఆకలి దహించుకుపోతోందిగానీ......గొయ్యితీసేస్తే..

"రేపైనా మనమే చెయ్యాలి ఇవ్వాళ సెలవే కూడా. రా! మదనా! గునపం తీసుకో" సూర్యం కూడా చెప్పటంతో గోపాలం లొంగక తప్పలేదు.

గొయ్యి తియ్యటమేకాదు. అందులో నాలుగు తట్టల ఎండుటాకులూ— నాలుగు తట్టల పేడా వేస్తేగాని తృప్తి గలగలేదు. గర్వంగా ఇంటికి బయల్దేరారు ముగ్గురూ.

సత్యన్నారాయణ తెల్లని బట్టలు వేసుకొని మన్నగా తల దువ్వుకొని తుంగచాపమీద కూర్చుని ఎక్కాలు చదువుకొంటున్నాడు. తోటలోంచి వచ్చిన వాళ్లని చూసి, చూడనట్టు మొహం చెల్లక కాబోలు— కంఠం హెచ్చించి చదువులో మునిగిపోయాడు. ఇక కృష్ణుడు ఇంట్లోనేలేడు. రొంప ఎక్కడికి పోయిందోనని వెతుక్కోవటానికి పోయాడు కాబోలు.

మధుకి సత్యన్నారాయణని చూస్తుంటే జాలి వేసింది. పాపం వాడి తప్పేమీ లేదనిపించింది— "ఒరేయ్! నీకు నిజంగా రావాలని లేదూ? పోనీ సాయంత్రం వస్తావా?" అన్నాడు దగ్గిరికి వెళ్ళి.

గదిలోకి వెళ్తూన్న పార్వతి మధునిచూసి ఆగిపోయింది— "ఆ మట్టి కాళ్లతో కొత్త చాప తొక్కుతావా ఏమిటి? ఏమిటా మీద నించోటం" అంది. మధు కాళ్లకేసి చూసుకున్నాడు. కాళ్లు కడుక్కోని మాట నిజమే. అయితేమాత్రం?— మాట్లాడకుండా దొడ్లోకి వెళ్ళిపోయాడు— పార్వతి ప్రత్యేకంగా సత్యన్నారాయణ చదువుకోసం కుంచెడు ఒడ్లుపోసి ఆ తుంగచాప కొంది. గాదిలోంచి ఒడ్లు తీయిస్తూ స్వగతంలా అనుకొంది కొంచెం గట్టిగా — "మాకేం పిల్లా? జెల్లా? మాకు రావలసిందంతా తీసుకోవటం లేదుగా?"

సత్యన్నారాయణ వచ్చిన దగ్గిర్నుంచీ పార్వతి ప్రవర్తన సావిత్రి కనిపెడుతూనే ఉంది. సుధనో కృష్ణుణ్ణో ఆప్యాయంగా దగ్గిర కూర్చోబెట్టుకునేది, వాళ్లని పిలవటమే మానేసింది. ఏది ఉన్నా సత్తిగాడికే పెట్టటం—డబ్బు లిస్తే వాడికే ఇవ్వటం ఏది చేసినా సత్యన్నారాయణకే— దొంగకు తేలు కుట్టినట్టు లోలోపల అనుకోవటం తప్పితే ఏమీ చేయలేకపోయింది సావిత్రి.

గబ గబా మొహాలు కడుక్కుని వాన చినుకులు పడి తడిసిన తలలు చొక్కాలతో రుద్దుకొని ఆవురావురుమంటూ అన్నాలకు వచ్చి కూర్చుంటే సావిత్రి నెమ్మదిగా అంది— "చద్దన్నం అయిపోయింది. పిడికెడుంటే సుధకీ, సుశీలకీ పెట్టేశాను. ఎంతసేపు? ఎసట్లో బియ్యం వెయ్యనే వేశాను. కూర్చోండి. వార్చేస్తాను."

పిల్లలకి మండిపోయింది. మళ్లా చద్దన్నం లేదూ? "మరి చద్దన్నం తినకుండానే కృష్ణుడెలా వెళ్ళిపోయాడు?" అన్నాడు గోపాలం మంటగా,

"వాడికేం? ఎంచక్కా గ్లాసుడు పాలు తాగేస్తాడు. నీకు తెలీదేమిటి?" అన్నాడు మధు కసిగా.

"చాల్లే వూరుకో. గ్లాసుడంటావు. చెంబెడంటావు! వాడుమాత్రం పాలెందుకు తాగుతాడు? ఆకలి కడుపుతోనే ఉండమంటే వినకుండా ఎక్కడికో చదువుకుంటానని పోయాడు." సావిత్రి కసిరింది.

"అస్తమానం చద్దన్నం లేదంటావేం?" అన్నాడు మధు కోపంగా. చద్దన్నం ఉండక పోవటంలో అంతరార్థం సుందరమ్మగారికి తప్పితే ఎవ్వరికీ తెలీదు — సత్యన్నారాయణని చద్దన్నం తినటం మాన్పించేసింది పార్వతి— "అసలే అర్భకం వెధవ! ఈ వర్షాకాలం వాడికి చద్దన్నం అరుగుతుందా? చస్తుందా?" అంటూ ఓగ్లాసుడు పాలు ఎర్రగా మరగబెట్టి పంచదార కలిపి తాగించటం ప్రారంభించింది. సత్యన్నారాయణకి మొదట్లో కాస్త సరదా వేసినా రోజూ పాలే తాగటం నచ్చలేదు— ఒకరోజు పాలగ్లాసు అందుకోకుండా— "నాకు పాలు వద్దు పిన్నీ! చద్దన్నమే తింటాను" అన్నాడు ఆశగా.

"అమ్మో! వద్దు. ఈ వర్షాకాలం ఏ కడుపునొప్పైనా వస్తే మీ అమ్మ నాకు బడి దేవుళ్లాడుతుంది."

"మా అమ్మ నాకు చద్దన్నమే పెట్టేది పిన్నీ!"

పార్వతి క్షణం తీక్షణంగా చూసింది—"ఏంరా? నువ్వూ పెంకితనం నేర్చుకొంటున్నావా? ముద్దు పెట్టుకోబోతే మూతి నాకిందట— బాగానేవుంది. లక్షణంగా పాలు తాగమంటే నచ్చటంలేదూ? ఊ గ్లాసు తీసుకోవేం?" ఒక్క కసురు కసిరేసరికి సత్యన్నారాయణ తల వంచుకునే గ్లాసు అందుకున్నాడు— సత్యన్నారాయణకి ఇష్టం లేకపోయినా పాలు తాగటం తప్పలేదు— "ఛీ! వెధవ వానలు! ఎప్పుడు పోతాయో! వానకురవని రోజు కూడా పాలే తాగాలి" మనస్సులో విసుక్కున్నాడు.

సత్యన్నారాయణ చద్దన్నం మానేసి పాలు తాగటం సావిత్రి కేమీ నచ్చలేదు. పైకి ఏమైనా అంటే పార్వతి పూరుకోదు— "నా వాటాకి సగం పాలు వస్తాయి" అంటుంది. ఎటొచ్చీ దానికి పిల్లలులేరు. తనకు ఉన్నారు. ఖర్చు తనదేమరి. ఈమధ్య సావిత్రి కొత్త ఆలోచనలు నేర్పింది— ఆ కోపం కెలక వేసినప్పుడల్లా తన వంట రోజు

మర్నాటికి అన్నం మిగలకుండా తూచినట్టు బియ్యం పోస్తుంది. కృష్ణుడికీ, సుధకీ ఒక్కోసారి సుశీలకి కూడా వాళ్లతోపాటు పాలు ఇచ్చేస్తుంది. ఎటొచ్చీ అన్నం ఉడికేవరకూ ఆకలి కడుపులతో మాడుతూ కూర్చోవలసింది సూర్యం—మధూ గోపాలమే. చద్దన్నం ఉండకపోవటంలో అంతరార్థం సుంద రమ్మగారు గ్రహించినా ఏమీ చెయ్యలేదు. కోడళ్లు ఆవిడ మాట వింటారనే భ్రమ ఎన్నడూలేదు. పార్వతి తల నొప్పిగా ఉందని పడుకుంటే ఆరోజు కూడా సావిత్రి వంట కుపక్రమించింది.

తోటలో పని చేసి ఆకలితో చస్తూవస్తే చద్దన్నం లేదనే.సరికి మధుకి కోపం వచ్చేసింది—వాడితోపాటు గోపాలం కూడా లేచి వచ్చేశాడు.

సత్యన్నారాయణా, సుధా జీడిపప్పు ఉండలు తింటూ కబుర్లు చెప్పుకొంటున్నారు. స్తంభానికి ఆనుకొని వాళ్లిద్దర్నీ చూస్తూ నిలబడి ఉంది. సుశీలకు కూడా ఆ ఉండ తినాలని ఆశగా ఉంది. సుశీల కన్నెత్తి మధుకేసి చూసింది. "అమ్మమ్మ నడిగి మనమూ తెచ్చుకుందారా చెల్లీ!" అన్నాడు మధు. సుశీల చేతులు తిప్పుతూ లేవన్నట్టు సైగ చేసింది.

"అమ్మమ్మ దగ్గిర లేకేం? ఉంటాయి. రా! తెచ్చుకుందాం" సుశీలను వెంటబెట్టుకొని సుంద రమ్మగారి దగ్గిరికి వెళ్లాడు మధు.

"అమ్మమ్మా! మాకూ జీడిపప్పు ఉండలు పెట్టవూ?"

"ఎక్కడివి?"

"అదే! సత్యన్నారాయణ, సుధా తింటున్నారు"

"అవా ? సత్యన్నారాయణకు వాళ్లమ్మ చేసి పంపింది. వాళ్ల వూరునుంచి. మన కెలా వస్తాయి?"

"మరి సుధ కూడా తింటున్నదిగా?"

"పెద్దత్త దానికి కూడా పెట్టింది కాబోలు." సుందరమ్మగారు క్షణం మాట్లాడకుండా ఉండి అంది—"పోనీలే బాబూ! అన్నం లేకపోతే చస్తాం గానీ, ఇలాంటి తిళ్లు లేకపోతే చస్తామా? నీకు మాత్రం తెలీదా? నన్ను అడిగితే నే నెక్కడ తెచ్చి పెట్టగలను చెప్పు?"

మధు మాట్లాడకుండా వింటున్నాడు. అమ్మమ్మతో తప్పకుండా పెట్టిస్తానని సుశీలకి ఆశ పెట్టాడు. పాపం దానికి ఎలాగ పెట్టటం?

"ఒరే! మధూ!" మాట. నెమ్మదిగా పిల్చాడు గోపాలం. వాడు చెయ్యి చొక్కా కింద దాచుకు న్నాడు. చేతిలో ఏదో తాయిలం ఉన్నట్టుంది. గోపాలం మధుని, సుశీలని గోడ చాటుకు తీసుకు పోయాడు. సంతోషంగా చొక్కా కిందనుంచి మరమరాల ఉండ పైకి తీశాడు. అది గుండ్రా యిలా చేతికి అబ్బకుండా ఉంది.



# కూలిన గోడలు

"ఇదెక్కడిదిరా మధూ?"

"సత్తిగాడి అమ్మ పంపించిందట. జీడిపప్పు ఉండలు అయిపోయాయట. పార్వతి పెద్దమ్మ ఎవ్వరికీ చూపించకుండా తినెయ్యమని ఇచ్చింది. అందుకే దొంగతనంగా తెచ్చాను. నీకు పెట్టకుండా నే నెలా తినేదిరా? మొన్న హరిగాడు నీకు జీడి ఇస్తే ముక్క నాకు ఇవ్వలా నువ్వు? తీసుకోరా నీకు కొంచెం, సుశీలకు కొంచెం."

"నాకు వద్దులే. మా చెల్లికి పెట్టు."

"అలాక్కాదు. ముగ్గురం కొంచెం తిందాం. నువ్వు తినకపోతే నేను తింటా నేమిటని?"

మధూ సుశీలా చేతులు జాపారు.—"గోపాలం పెద్దత్త 'నీకు మాత్రం ఎందుకు పెట్టింది?'"

"మా అమ్మ పంపించినవన్నీ సత్తిగాడు తినటం లేదా ఏమిటి? పెద్దనాన్న, పెద్దమ్మా కూడా తిరటూరుగా నావి."

అంతలో సావిత్రి అన్నాలకు పిలిచింది.

* * *

పిల్లా రెండు పూటలా తోటపని జరిగి తీరాల్సిందే. అది విశ్వనాథం ఆజ్ఞ! అన్నగారి ఆజ్ఞ పాటించటం సీతాపతి విధి!

"ఈ పూట నారింజ చెట్లు మొదళ్లు తవ్వాండి"

"గులాబీ చెట్లు పొగల్లా ఎదిగి గాలికి వాలి పోతున్నాయి. కాస్త గడలుబోటు పెడితే బాగా ఉంటాయి. దొడ్డి వెనక తుప్పలవెంట కాసిన్ని గడలు నరుక్కురండి."

"పొట్లపాదుకి పందిరి వెయ్యాలి తొందరగా. అది మరీ ఏపుగా పాకిపోతోంది."

"మల్లి మొక్కల ఆకు దూసెయ్యండి. గుబురుగా ఆకంతా ముద్దిరిపోతుంది."

సీతాపతి ప్రతి పూటా కొన్ని పనులు పురమాయిస్తాడు. అవి మరో పూటకల్లా చేసి చూపించాలి—విశ్వనాథం ఆగ్రహానికి గురి అయ్యే సాహసం ఎవ్వరికీ లేదు మరి.

కిష్టిగాడు తోటపనికి ఎప్పుడూ దొంగే. నాలుగైదు రోజులకు ఒక్కసారివచ్చి ఏదో చేసినట్లు నటించి పోతాడు. అయినా వాస్తవకరూ అవరు. ఇక సత్తిగాడు పాపం అర్భకుడు. పనులేమీ చెయ్యలేడు. మదన గోపాలాన్ని ఎవ్వరూ నిర్బంధించకపోయినా వాడు అందరికన్నా ముందుగానే తయారవుతాడు. చదువుకోవటం తప్పిపోతుందిగా మరి? సూర్యానికి ఏ. ఆలోచనా లేదు. పెద్దవాళ్లు చెప్పారు. చేసి తీరాల్సిందే. ఇక సమస్యంతా మధుతోనే, అందరూ చేస్తే తేలిగ్గా అవుతుందికదా? కిష్టిగాడు వీధులట్టుకు తిరుగుతాడుగాని" పని ముట్టుకోడేం? సత్తిగాడు కొమ్మలమీద పాకుతూ కోతిలా ఆడుకోగలడు. కాని పని చెయ్యలేడేం? మదనుడి కేముంది? చేస్తే చేస్తాడు. లేకపోతే లేదు. ఇక అన్నయ్యా, తనూ పనిమనుషుల్లా చేసి తీరాల్సిందే?

ఒకసారి టమాటా నారుకి మళ్ళు కట్టటంలో కిష్టిగాడికీ, మదనుడికీ తగూ వచ్చింది. మదనుడికి బాగా కోపం వచ్చేసింది. చేతులు దులుపుకుని లేచి పోయాడు—"నేనసలు ఏ పనీ చెయ్యను" అనేసి తోటలోంచి వెళ్ళిపోయాడు. మదనుడి అపరాధానికి ఆ రాత్రి విశ్వనాథం ముందు విచారణ!

"నన్ను తిట్టాడు పెదనాన్న!" ఏడవబోయాడు కిష్టిగాడు.

"ఉత్తదే. నేనేమీ అనలా. పని చెయ్యమని వచ్చేశానంతే." భయం భయంగా చెప్పుకున్నాడు మదనుడు. "కావాలంటే మధుని అడుగు."

"పిల్లికి ఎలుక సాక్ష్యం బాగానే ఉంటుందిలే. అయినా నువ్వు పని చెయ్యనని బెదిరించటం ఏమిటి? ఎవడికోసం చేస్తావురా? అప్పనంగా ఇక్కడ పడి తినటం అనుకున్నా వేమిటి?"

మదనగోపాలం తల దించేసుకున్నాడు. "మాట్లాడవేం? మధుగాణ్ణి చూసి నేర్చుకుంటున్నావా?" మీది మీదికి వచ్చాడు విశ్వనాథం—"ఈసారి పని మానేశావో వీపు చీరేస్తాను. మీ బామ్మ నిన్ను నా ఇష్టం వచ్చినట్లు చేసుకోమని అప్పగించింది. తెలుసా? ఈసారికి వదిలేస్తున్నాను."

గోపాలం ఎన్నడూ ఎరగని ఆ బెదిరింపులకు వణికిపోయాడు. వాడు వూహ తెలిశాక ఒక్క దెబ్బ కూడా పడి ఎరుగడు. విశ్వనాథం మాటలతో వాడికి ఏడుపు వచ్చినంత పనైంది—అనుకోకుండా ఆ రోజే గోపాలం వాళ్ల అన్నయ్య వచ్చాడు తమ్ముణ్ణి చూడటానికి. గోపాలాన్ని వీధిలోకి తీసుకెళ్ళి ఏదో అడగబోతోంటే బావురుమన్నాడు గోపాలం—"నన్ను పెదనాన్న కొడతానని తిట్టాడు అన్నయ్యా! ఎప్పుడో నిజంగా కొట్టేస్తాడు కూడా, అస్తమానూ మధూని అలాగే కొడుతూఉంటాడు" అంటూ గోల పెట్టాడు. గోపాలం అన్నయ్య సావకాశంగా అంతా తెలుసుకుని తమ్ముణ్ణి ఓదార్చాడు? "ఛ! ఏదో బెదిరించాడుగానీ ఎందుకు కొడతాడు"




"ఏమో! నేను ఇక్కడే ఉండను."

"చాల్లే. ఈ మాత్రానికే అక్కడికి వస్తానంటే బామ్మ అసలేతంతుంది."

బిక్కమొహం వేశాడు గోపాలం. "నీ కెందుకు నువ్వూరుకో. నీ ఒంటిమీద చీమ పాకకుండా నేను చేస్తానుగా."

గోపాలం అన్నయ్య వెళ్ళిన నాలుగోనాటికే విశ్వనాథానికి ఉత్తరం వచ్చింది. అది గోపాలం బామ్మ విశ్వనాథాన్ని పుత్ర పౌత్రాభివృద్ధిగా దీవించి వ్రాయించింది. సమాచారం ఏమిటంటే "మదన గోపాలం అంటే ఆవిడకు బహిఃప్రాణం. దానికి కారణ మేమిటంటే వాడికి ఆవిడ పేరూ, భర్తగారి పేరూ రెండూ కలిపి మరీ పెట్టారు. అతడిపేరు గోపాలరత్నం. ఆయనపేరు మదన కామయ్య— అందుకే మనవడిపేరు మదనగోపాలం. అది ఉపోద్ఘాతం—తర్వాత......

గోపాలుడిది 'వెన్నలాంటి మనస్సు' కసిరినంత మాత్రానే గుడ్ల నీరు తిప్పుకుంటాడు. తెల్లనివన్నీ పాలూ, నల్లనివన్నీ నీళ్లని నమ్మేస్తాడు. వెర్రి నాగన్న, పిచ్చి వెంకన్న, కుర్ర సన్యాసి—అదీ గోపాలుడి వ్యక్తిత్వం. అటు వెనక........

వాడిని తమ చేతులతో దండించలేకనే పొరుగు వాళ్ళ ఇంటికి పంపించింది. కాని అహర్నిశం ఆవిడ ధ్యాసంతా వాడిమీదనే. కుర్రసన్యాసి ఏమై పోతున్నాడో—ఎలా తింటున్నాడో, ఎలా ఉంటున్నాడో. అలా—అలా పరాయివాళ్లు పిచ్చి నాగన్న నేమైనా చేస్తారనుకుంటే ఆవిడ వూపిరి బిగబట్టుకు పోతుంది. గర్భకోశం దహించుకుపోతుంది. నవ నాడులూ కృంగిపోతాయి. గుండె దడదడలాడుతుంది. చివరికి కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి. అది ఆవిడి అనురాగం.

ఇక బహిరంగం : మొన్న పెద్దాడి చూసి కుర్ర సన్యాసి బావురుమన్నాడట. భయపడ్డాడో ఏమో! పెద్దవాళ్లు బెదిరించినా ఏమంత తప్పులేదుగానీ.... అయినా........పరాయి వాళ్లఇంట్లో ఉండి బాధ కలిగించకుండా తీసుకువెళ్ళిపోతే బావుండునేమో నన్న ఆలోచనగా ఉంది. వాణ్ణి అప్పనంగా తిండికి పెట్టాలన్న ఉద్దేశ్యం ఎప్పుడూ లేదు. పండుగ వెళ్లాక కొత్త ధాన్యాలు వచ్చాక వాడి ఖర్చులన్నీ పంపించాలని అనుకొంటూనే ఉన్నారు. కాబట్టి .."

ఆ ఉత్తరం విశ్వనాథాన్ని ఒక్క కుదుపు కుదిపింది. అతి సామాన్యమైన విషయంలా తీసి పారెయ్యటానికి ప్రయత్నించి ఆ ఉత్తరం చించి పారేశాడు. గోపాలాన్ని పల్కరించటమే తగ్గించేశాడు.

* * *

ఎంత ఉత్సాహంగా చేస్తున్నా—చేసింది తక్కువా, చెయ్యాల్సింది ఎక్కువా ఉంటోంది తోటపని. ఒకరోజు సీతాపతి అన్నాడు—"ఒరేయ్ మధూ! నీకు చాలా బలగం ఉందటకదూ? అప్పుడప్పుడూ, సెలవు రోజుల్లో తీసుకొస్తూ ఉండరాదూ? కాస్త తోటపని తొందరగా అవుతుంది."

ముందు అర్థం కాకపోయినా తొందరగానే గ్రహించుకున్నాడు మధు. హృదయాని సంతోషం వేసింది—తన స్నేహితులనందర్నీ తీసుకువచ్చి తోటపని చేయించమంటే ఇంకేం? చిటికెల్లో చేయించగలడు.

**ఆ వీధిలో చాలామంది పిల్లలకన్నా మధు చిన్నవాడే అయినా ఆటల్లో నాయకత్వం మధూకి**

దక్కింది. మధు ముఠాలో డజనుమంది పైగా సభ్యులున్నారు. అందరూ మధూ మాట వేదవాక్కులా పాటించి తీర్తారు. ఏ ఆట ఆడాలంటే అదే! ఎలా జట్లు విడమంటే అలాగే! ఎవర్ని లీడర్లుగా ఉండమంటే వాళ్లే! ఎవరింటి దగ్గిరంటే అక్కడే! మధూ స్నేహితులందరికీ ప్రాణం. స్నేహితులు మధుకి దేహం!

మధూ ముఠా విశ్వనాథం తోట పనిలో జొర బడింది. మధు అందర్నీ జట్లు జట్లుగా విడదీశాడు. అన్ని జట్లుకీ తలకోపనీ పురమాయించాడు. మళ్లు కట్టి విత్తనాలు నాటటం—మొక్కలకు నీళ్లు పొయ్యటం—పాదులకు పందిళ్లువేయటం—చీడ పురుగుల్ని ఏరి పారెయ్యటం దిష్టి బొమ్మలు కట్టి వ్రేళ్లాడదియ్యటం ఇత్యాది పనులన్నీ అతి సునాయాసంగా జోరుగా సాగిపోయాయి. రోజు రోజుకీ తోట కన్నుల పండువుగా తయారు కాసాగింది.

వేసంగి సెలవులకు సత్యన్నారాయణా మదన గోపాలం ఇళ్లకు వెళ్లలేదు. వాళ్లిద్దరికీ ప్రయివేట్లు చెప్పించి బళ్లు తియ్యగానే హైస్కూల్లో చేర్పిస్తారట. ఆ ప్రయివేటేదో సీతాపతే చెప్పటానికి మాట్లాడుకున్నాడు. సీతాపతికి అంత తెలివి తేటలు పుట్టటం అన్నగారి సలహామీద మాత్రమే. కృష్ణుణ్ణికూడా హైస్కూల్లో చేర్పించాలంది సావిత్రి— ఆ రాత్రి సీతాపతి కొడుకుని దగ్గర కూర్చోబెట్టుకొని వాడి చదువు సంధ్యల పరిశీలనకుపక్రమించాడు— "పదమూడో ఎక్కం అప్పజెప్పరా!"

తేలకళ్లు వేశాడు కృష్ణుడు.

"అదేం? అలా చూస్తావ్? రాదా?"

అడ్డంగా తలవూపాడు వాడు.

"నువ్వురా గోపాలం!"

ఐదారు తప్పులతో నట్టుతూ నట్టుతూ అప్పగించాడు గోపాలం. సత్యన్నారాయణకి బాగానే వచ్చింది. మధు మాత్రం జలపాతపు ప్రవాహంలా గడ గడా ఎక్కడా తడుముకోకుండా చదివేస్తున్నట్టే అప్పగించాడు.

కొడుకుకి పదమూడో ఎక్కం రాకపోతే సీతాపతికే సిగ్గు వేసింది — "అసలు నీకు ఎన్ని ఎక్కాలు వచ్చురా?"

కృష్ణుడు మాట్లాడలేదు.

"వాడికి ఐదువరకే వచ్చు మామయ్యా! నాకు ఇరవై కూడా వచ్చు" మధు అతిశయంగా అన్నాడు.

"నిన్నా నేను అడిగాను?" తీక్షణంగా చూశాడు సీతాపతి. "ఎవర్ని అడిగితే వాళ్లే చెప్పాలి" కొడుకు కేసి చూస్తూ—"చెప్పవేంరా? నీకు ఎన్ని ఎక్కాలు వచ్చని అడుగుతున్నాను."

భయం భయంగా అన్నాడు కృష్ణుడు "ఐదే".

"ఏం? అంతకన్నా ఎక్కువైతే అజీర్ణం చేస్తుందనుకున్నావా? వీధులట్టుకు తిరగమంటే బాగానే ఉంటుంది కదూ?—సరేలే! పలకలు తీసుకోండి. డిక్టేషన్ చెప్తాను."

పావుగంటకల్లా అదీ ముగిసింది. మధు పూర్తిగా రైటు—సత్యన్నారాయణకి రెండు తప్పులు—గోపాలానికి ఐదు తప్పులు—కృష్ణుడికి ఎనిమిది తప్పులు మొత్తం చెప్పినవి పన్నెండు మాటలు.

"లెక్కలు వేసుకోండి."

కూడికలూ తీసివేతలూ మాత్రం చెయ్యగలిగాడు కృష్ణుడు—ఎక్కాలు రాందే గుణకారాలూ అవీ ఎలా చేస్తాడు. మధు ఫస్టుగాడున్నా సత్యన్నారాయణ ఇంచుమించు వాడిని అందుతున్నాడు. గోపాలం సరాసరిగా ఉన్నాడు—కృష్ణుడు మాత్రం బాగా దివాలాగా ఉన్నాడు.

మధునిచూస్తే సీతాపతికి ఎంతో ముచ్చట వేసింది. తన కొడుకు అలా ఎప్పుడు తయారవుతాడు? కృష్ణుడిమీద కోపం వచ్చింది— "అల్లరి వెధవా! నీకు సిగ్గు వెయ్యటం లేదూ? మధు చూడు. ఎంత తెలివిగా ఉన్నాడో!" అన్నాడు.

కృష్ణుడికి అసలే ఉక్రోషంగా ఉంది. పైగా మధుగాణ్ణి చూపించి తిట్టటంతో ఏడుపే వచ్చింది. సీతాపతి లేవగానే కృష్ణుడు ఏడుస్తూ సావిత్రి దగ్గిరికి వెళ్లాడు.—"అప్పుడే వీణ్ణి ఫస్టుఫారంలో ఎలా చేర్చుకుంటారు? మరీ దారుణంగా ఉన్నాడు" అన్నాడు సీతాపతి పెళ్లాంతో.

సావిత్రి కొడుకు తల నిమురుతూ, "మరేం ఫర్వాలేదు. ఇంకా సెలవులున్నాయిగా? వాడికే వస్తాయి" అంది. కొడుకు చదువుమీద నమ్మకం లేకపోయినా శిక్షణ ప్రారంభించాడు సీతాపతి.

"ఏవోయ్? సుబ్బారావ్, ఎంతగా మారిపొయ్యావ్ యీ పదేళ్లలో. రంగు మారింది, ముఖం మారింది, ఫేసన్లు మార్చావు, నడకమారింది, ఏమిటీ విశేషం?"

"సారీ సారీ! మీరు పొరబాటు పడుతున్నట్లున్నారు, నా పేరు సుబ్బారావు గాదు. కామేశ్వరరావు."

"ఓహో! అయితే పేరు కూడా మార్చావన్నమాట ఆఁ!"

విద్యారాణి (విజయవాడ)

హైస్కూల్లో చేరాలనే సంబరంతో మదనగోపాలం శ్రద్ధగానే చదువు సాగించాడు. కృష్ణుడు మాత్రం ఒక్క అంగుళం ఒరిగినట్టు సీతాపతికి తోచలేదు.

* * *

హైస్కూలు తెరిచేసరికి ఇల్లంతా హడావుడిగా తయారైంది. పిల్లల్ని ఫస్టుఫారంలో చేర్పటానికి సత్యన్నారాయణ నాన్నా— మదనగోపాలం అన్నా వచ్చారు. కృష్ణుణ్ణి కూడా ఫస్టులోకి గెంటాలని అందరికీ కోరికైతే ఉందిగానీ, వాడి చదువు బొత్తిగా చాలకుండా పోయింది.

మర్నాడు పరీక్షలకు వెళ్లాల్సిన ఆ సాయంత్రం మదనగోపాలం సత్యనారాయణా హుషారుగా హైస్కూలు కబుర్లు చెప్పుకొంటూంటే మధు దిగాలుపడి సూర్యంకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

"ఒరేయ్ గోపాలం! పెద్ద బళ్లో బోలెడు మంది మేష్టర్లుంటారట. గంటకో మేష్టారొస్తారట! అంత మంది ఏం చెప్తారు?"

"అక్కడ పెద్ద పెద్ద పాఠాలు అవీ ఉంటాయి కదా?"

"అందుకే కాబోలు. లెక్కలకో మేష్టారు—పాఠాలకో మేష్టారూ—బొమ్మలకో మేష్టారూ...."

"ఆటలకు కూడా ఓ మేష్టారు ఉంటారట్రా"

"నాకు తెలుసు. మా అన్నయ్య ఎప్పుడో చెప్పాడు"

ఉన్నట్టుండి కబుర్లలోంచి బయటపడి మధుని చూస్తూ అన్నాడు గోపాలం—" ఒరేయ్! నువ్వు పెద్ద బళ్లో చేరవు?"

మధు ఒక్కసారి తిరిగి చూసి మొహం తిప్పేసుకున్నాడు. వాడికెందుకో కోపంగా ఉందని గోపాలానికి అర్థమై పోయింది— హైస్కూల్లో చేరటం గొడవ బయల్దేరిన దగ్గర్నుంచి గోపాలానికి సత్యనారాయణ దగ్గిరే కాస్త స్నేహమైంది. తామిద్దరూ హైస్కూల్లో చేరే వాళ్ళు కాబట్టి కలిసి ఉండాలనే ఉద్దేశ్యం ఇద్దరికీ ఏర్పడింది. మధు గురించి ఎటువంటి ప్రయత్నాలూ జరుగుతున్నట్లు లేదు.

సూర్యం రాగానే మధు అడిగాడు పెద్దబడి మాట.

"ఏం అన్నయ్యా? మామయ్యని అడుగుతానన్నావు కదూ? రేపే సత్యనారాయణ్ణీ మదన గోపాలం హైస్కూలుకి వెళ్ళి పోతారట నేను మాత్రం వెళ్లొద్దేమిటి?"

సూర్యం మధు గురించి పెద్ద మామయ్యనడుగుదామని ప్రతిరోజూ అనుకుంటూనే ఉన్నాడు—"నిన్ను మాత్రం ఎందుకు చేర్పించరు?" అని తమ్ముడికి ధైర్యం కూడా చెప్పాడు. ఇక అడగక పోతే సమయం మించి పోతుందని "సరేలే, రాత్రికి నిజంగా అడుగుతానుగా?" అని మధుని పూరడించాడు.

రాత్రి భోజనాల తర్వాత విశ్వనాథం సీతాపతితో మాట్లాడుతూ అరుగు మీద కూర్చున్నప్పుడు సూర్యం నెమ్మదిగా దగ్గరికి వెళ్లి నిలబడ్డాడు.

"మామయ్యా!...."

మాటలు ఆపి విశ్వనాథం మేనల్లుడికేసి చూశాడు. సూర్యం అంటే కొంచెం అభిమానం ఉన్నట్టే ఉంది.

"ఏవిట్రా?"

సూర్యం గొంతు పెగుల్చుకొని ధైర్యంగా అనేశాడు.

"మధు కూడా... హైస్కూల్లో చేరతానంటున్నాడు"

ఆశ్చర్యంగా చూశాడు విశ్వనాథం—" మధుగాడు హైస్కూల్లో చేరతాడా?"

"అవును మామయ్యా!"

"అంత ప్రయోజకుడయ్యాడూ? కృష్ణుడికన్నా చిన్నవాడేగా?"

సీతాపతి అన్నాడు— "మధు బాగానే చదువుతాడు అన్నయ్యా!"

"ఎంతబాగా చదువుతాడేమిటి? అస్తమానూ వెధవతిరుగుడు—ఆటలు—గంతులేగా వాడి ఉద్యోగం? ఫస్టుఫారంలో చేరటం అంటే మాటలేం కాదే! అందుకే కాదూ కృష్ణుడి ఆశ వదిలేసుకున్నాను."

"మధు... అలా కాదు మామయ్యా!"

"ఇంకేం. పూడబొడ్చుస్తాడేవిట్రా?"

# కూలిన గోడలు

సీతాపతి తనకు పట్టనట్టు వూరుకున్నాడు. సూర్యం కూడా మాట్లాడలేదు. దూరంగా గుమ్మం దగ్గర నిలబడి అంతా వింటున్న మధు ఏం చెయ్యాలో అర్థం కాని వాడిలా అలాగే చూస్తూ నిలబడ్డాడు.

విశ్వనాథం సూర్యాన్ని చూస్తూ తాపీగా అన్నాడు: "ఈ ఏడాదికి పోనివ్వరా! వచ్చే సంవత్సరం చూద్దాం."

ఇష్టంలేని వాడిలా చూశాడు సూర్యం.

"వచ్చేసారి కృష్ణుడు వాడూ కలిసి చేరతారులే."

మధుకి కోపం ముంచుకు వచ్చేసింది. మరి మాట్లాడకుండా నిలబళ్లేకపోయాడు. నాలుగడుగులు ముందుకు వచ్చేశాడు—"అదేమిటి? వాడి కోసం నేను ఆగుతానా?"

విశ్వనాథం తలతిప్పి చూశాడు—" ఓహో! తమరు వింటూనే ఉన్నారూ?" వెటకారంగా అన్నాడు.

మధు తెగించినవాడిలా అడిగాడు —" సత్యనారాయణా మదనగోపాలం వాళ్లంతా ఇప్పుడే చేరుతోంటే నేను మళ్లా సంవత్సరం వరకూ ఉండాలేమిటీ కిష్టిగాడి కోసం వాళ్లెవరైనా ఆగుతున్నారా?"

విశ్వనాథం కాస్త కంఠం ఖంగుమనిపించాడు —

"ఎందుకురా ఆ మిడిసిపాటు ? ఇప్పుడేమంతగా కంగారు వచ్చింది? ఫస్టుఫారంలో చేర్చుకుంటారేం నిన్ను?"

మధు సీతాపతిని సాక్ష్యం వేసుకున్నాడు—"చిన మామయ్యా! నువ్వు అందర్నీ ప్రశ్నలు వేస్తే నాకే ఎక్కువ మార్కులు రాలేదూ? కిష్టిగాడూ నేనూ ఒకటా? గోపాలాన్ని చేర్చుకుంటే నన్ను చేర్చుకోరు? నువ్వు చెప్పవేం మామయ్యా?"

తనమీదకొచ్చి పడిందేమిటా అన్నట్టు సీతాపతి నోరు తెరవటానికి ఓ గంట చేశాడు. చివరికి ఏదో అనబోతే విశ్వనాథం ఖచ్చితంగా చెప్పేశాడు—

"వాడెంత ఎగిరి పడినా ఈ ఏడాదికి వీలుకాదు. పెద్దవాడికి జీతాలు కడుతున్నాం. ఇక వీడికీ ఎక్కడ తేవటం? వచ్చే ఏడు చూద్దాంలే."

"కాదన్నయ్యా....."

"ఏమిట్రా కాదు? అసలు వాణ్ణి హైస్కూల్లో చేర్చుకుంటారురా?"

"పోనీ చేర్చుకోకపోతే వాడే మానేస్తాడుగా?"

"చాల్లే. మనకు సిగ్గు చేటు."

సీతాపతి మాట్లాడలేదు. సూర్యం కూడా మాట్లాడలేకపోయాడు. మధుకి కోపం,దుఃఖం ముంచుకు వచ్చాయి.— హైస్కూల్లో తనని చేర్చుకోరూ! తనకి చదువు బాగారాదూ? — కసితో వెర్రివాడిలా అరిచేశాడు—"వెధవ కిష్టిగాడితో నాకు జతా? వాడికస్సలు ఏమీ రాదు. ఆటలు కూడా రావు. పది సంవత్సరాలకూడా వాణ్ణి చేర్చుకోరు. నన్నెందుకు చేర్చుకోరేమిటీ?" మధుకి ఏడుపు కూడా వచ్చేసింది.

"ఏమిట్రా ఆ వాగుడు? వూరుకుంటున్నాననా?"

మధు చెంప చెళ్లుమంది. చెయ్యి తీసే సరికి ఎర్రగా పొంగి పోయింది—"పో! వెధవా! నీకీ తల తిరుగుడే వద్దని లక్షసార్లు చెప్పాను. పెద్దా చిన్నా ఏం లేదేం నీకు? మహా పండితుడి లాగా బయల్దేరాడు" విశ్వనాథం చీదరించుకున్నాడు.

సూర్యం నెమ్మదిగా మధు చెయ్యి పట్టుకో బోతే విసిరి కొట్టాడు—

విశ్వనాథం కళ్ళెర్ర జేశాడు—"ఏంరా? ఒళ్లు చిటపటలాడుతూందా?"

పెద్ద మామయ్యని అలా గుప్పట్లో పట్టి సరి పెయ్యాలన్న కసి మితి మీరి పోయింది మధులో.

"ఒరేయ్ మధూ! అన్నానికి రావేం? అందరూ తింటే నువ్వెందుకలా బిర్ర బిగిసి కూర్చున్నావ్?"

సుందరమ్మ గారికి దొడ్లో పనులు తెములుకు బయట పడే వరకు సంగతేమీ తెలీలేదు— మామయ్య ఏం చెప్తాడో రేపు ఏమౌతుందో మధుకి అన్నం తినబుద్ధి కాక అంతవరకూ ఉండి పోయాడు. సుందరమ్మ గారు రావటంతో విశ్వనాథం లేచి గదిలోకి వెళ్లి పోయాడు.

"నాతో తింటానన్నావుగా? రావేంరా?"

మధు మాట్లాడలేదు.

"ఏంరా సూర్యం? వాడలా నిలుచున్నాడు?"

"వాడుకూడా హైస్కూల్లో చేరతానంటె మామయ్య వద్దంటున్నాడు—"

సుందరమ్మ గారు సూర్యాన్ని నెమ్మదిగా అడిగి సంగతంతా తెలుసుకొంది— మధు వెళ్లి ఏడుస్తూ పడుకున్నాడు. ఎంత బుజ్జగించినా అన్నానికి రానని భీష్మించాడు. ఏమీ చెయ్యలేక సుందరమ్మ గారు నిట్టూర్చి వూరుకుంది

ఆ రాత్రి సుందరమ్మ గారికి—మధుకి నిద్ర రాలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్న మనవణ్ణి ఓదార్చ డానికి ఆవిడ ఎన్నో ప్రయత్నాలు చేసింది—"నా మాట విను నాయనా! నేను తెల్లవారాక మామయ్యని అడుగుతాను కదూ?" అంది.

"ఉత్తదే! మీరెవ్వరూ బాగా అడుగరు" నిస్పృహాయంగా అన్నాడు మధు — "అంతా పిరికివాళ్లే. మామయ్య ముందు ఎవ్వరూ మాట్లాడరు. బాగా అడిగితే ఎందుకు ఒప్పుకోడు?"—తను అడిగితే చావగొడతాడు. అమమ్మో అన్నయ్యో మామయ్యని నిలదీసి అడగాలని మధు కోరిక.

"నేను బాగానే అడుగుతానుగా? నువ్వు చదువు కోవటం నాకు ఇష్టం లేదా అస్తిపాస్తులు లేకపోగా నాలుగు అక్షరం ముక్కలైనా నేర్చుకోనివ్వక పోతే ని గతేంకావాలి?"

అమ్మమ్మ నిజంగా అడుగుతుందేమోనని మధుకి అనుమానం వచ్చింది. "నిజంగానా అమ్మమ్మా!"

"నీకెందుకు నువ్వు నిద్రపో."

ఆ సంతోషంతో మధుకి నిద్రపోబుద్ధి కాలేదు. గోపాలం వాళ్లు తొందరగా లేచి వెళ్లి పోతే....? శాయశక్తులా నిద్రను వెనక్కి నెట్టి కళ్లు తెరుచుకుని పడుకున్నాడు. (సశేషం)

# రామచరిత మానస్

తులసీదాసు



తెలుగు ముంగర శంకరరాజు

## 36

'భగవాన్ ! యేదో ఘోరము జరిగి పోయినది. ధీమంతుడు, బలవంతుడు అయిన నామరది చెప్పరాని బాధతో మరణ వేదన పొందుచున్నాడేమి !' అని వూహించి భూపుత్రి భీతావహయై ఘోరున విలపించెను.

ఆ విషమ స్థితిలో ఎక్కడి నుండియో "ఓ లక్ష్మణా ! సీత సౌభాగ్యవతి, ఆమె క్షేమముగా నుండ గలదు. నీవు కలత చెందక ధైర్యముతో ఆమెను వదలిపెట్టి వెనుకకు మరలుము—" అని అశరీరవాణి ఒకటి ధ్వనించెను.

అదృశ్యవాణి మాటలు మైథిలి చెవుల బడెను. అందలి గూడార్థము మెరుపు మెరసినట్లు ఆమెకు అవగత మాయెను. మరుక్షణమే ఆ మహాతల్లి శోకార్తయై ఆక్రందించి నేలబడి మూర్ఛిల్లెను.

లక్ష్మణుడు ఆకాశవాణి ఆదేశము వినెను. అచేతన స్థితిలో నేల పడియున్న అన్న భార్యను చూచెను. బాష్పాంజలి ఘటించి భూపుత్రికి ప్రదక్షిణ చేసి ఆమె పాదములకు నమస్కరించెను. పిమ్మట గుండె రాయి చేసుకొని, ఆ నిర్జనారణ్యములో ఆమెను ఏకాకినిగా వదలిపెట్టి, రథము యెక్కి, అయోధ్యకు తిరిగి పోయెను.

### సీత వాల్మీకి ఆశ్రమము చేరుకొనుట

కొన్ని ఘడియలు గడచు నప్పటికి సీతకు తెలివి వచ్చెను. ఆమె నిట్టూర్చి పరిసరములను పరికించి చూచెను. అక్కడ సౌమిత్రి లేడు. సారథి లేడు. రథము లేదు, అశ్వములు లేవు. భీకరారణ్యములో ఆమె ఒంటరిగా వదిలిపెట్టబడియుండెను. దిక్కులేని తన దీనస్థితికి ఆమె మింటికీ మంటికీ యేక ధారగా రోదించ సాగెను. ఆ నిస్సహాయురాలి ఆక్రందనకు కానన భూమి కన్నీరు గార్చెను. —"దాశరథి నన్ను త్యజించెను ! మరది నాకు ప్రవాసము ప్రసాదించి పోయెను ! దుర్విధిపాకము. కలకాలము కష్ట పరంపరలు నన్ను వెంటాడుచున్నవి. దురంత దుఃఖములకు నిరంతరము అలవాటు పడిన ఈ దేహి దేహమును వదలిపెట్ట జాలకున్నది." ఇవ్విధముగా భూపుత్రి గతాగత కష్టగాథలు స్మరించుకొని పలు విధముల విలాపించెను. వైదేహి విలాపాక్రందనలచే విపిన స్థలి కరుణా కలితమై పోయెను.

సరిగా ఆ సమయమునకు వనములో సంచరించుచున్న వాల్మీకి మహర్షి చెవులకు ఆమె ఆర్త స్వరము వినబడెను. తక్షణమే ఆ తాపస పుంగవుడు పృథ్వీ పుత్రి ఉన్న దెసకు వరుగెత్తెను. అతడు శోకార్తయై విలపించుచున్న సీతను సమీపించి— "బిడ్డా ! ఎవరు నీవు ? ఈ యడవిలో ఒంటరిగా దీనురాలివై యేడ్చుటకు కారణమేమి ?" అని సాధు భాషణముల ప్రశ్నించెను.

"ఓ తాపసోత్తమా ! నేను మిథిలా పురాధీశుడగు జనకరాజు పుత్రికను. పురుషోత్తముడగు రఘుకుల రాముని భార్యను. పేరు సీత. ప్రాణేశ్వరుడెందుకో నన్ను పరిత్యజించినట్లు తోచుచున్నది. నా మరది లక్ష్మణమూర్తి నన్ని కానన సీమలలో వదలిపెట్టి యెచ్చటికో వెళ్లి పోయెను. సర్వదా నా శుభముకోరు సౌమిత్రి నాతో కారణము చెప్పుటకు నోరాడక శోకార్తుడై ముఖము తప్పించుకొనెను. మహాత్మా ! నిరాశ్రయనై విధి వైపరీత్యమునకు వగచుచుంటిని." అని పలికి సీత సాశ్రులోచనయై నిట్టూర్చెను.

అంతట మహర్షి— "కల్యాణీ! జ్ఞాన సంపన్నుడగు నీ తండ్రి జనకుడు నాకు ప్రియ శిష్యుడు. అయోధ్యాధీశులు నాకు పరమ ఆప్తులు. నేను నీకు ఆత్మీయుడను. నీవు నాకు బిడ్డతో సమానము. నా ఆశ్రమము నీకు అన్ని విధముల స్వగృహముతో సమానము. మునిపత్నులు తాపస కన్యలు కంటికి రెప్పవలె నిన్ను చూచు కొందురు. బిడ్డా ! శోకించక నాతో కుటీరమునకు రమ్ము. నీకు శుభము కలుగు గాక." అని సాంత్వనము పలికి సీత నాశ్వాసించెను. పిమ్మట మునీశ్వరుడు పరమాదర భావముతో వైదేహిని వెంటబెట్టుకొని స్వాశ్రమము చేరుకొనెను.

పుణ్య భూమి మునిగ్రామములో అడుగు పెట్టగనే సీతకు సుంత దుఃఖోపశమన మయ్యెను. అచ్చటి ప్రశాంత వాతావరణము ఆమె ఆత్మకు శాంతి నిచ్చెను. గంగలో స్నానము చేసి, విగత శ్రమయై స్వామిని సంస్మరించి, సాత్వికాహారముతో పరితృప్తి చెంది సీత విశ్రమించెను. త్రికాలజ్ఞుడు వాల్మీకి మహర్షి సాకేతపురి సమాచారమంతయు యోగదృష్టిచే సమగ్రముముగ తెలుసుకొనెను. "జానకీ, అపవాదు బాపు కొను కొనుటకై అవధేశుడు నిన్ను వదలుకొనెను." అని చెప్పి మునిరాజు మైథిలిని వూరడించెను.

ఆ పైన జనకాత్మజ శుచివ్రతయై ఆశ్రమ వాసము చేయుచూ, నిత్యము ఋషీశ్వరుల చెంత పురాణేతిహాస కథలు వినుచూ, ముని పత్నుల స్నేహ వాత్సల్యచ్ఛాయల సంచరించుచూ వన విహంగ జంతుకోటితో వినోదించుచూ, మధుర ఫలోదకములతో తృప్తి చెంది, వన వైభవమును నేత్ర పర్వముగా తిలకించుచూ, ఆశ్రమ వాసము చేయుచుండెను. కాలాంతరమున జానకి ఇద్దరు పుత్రులను ప్రసవించెను. వాల్మీకి వారికి లవకుశులని నామకరణము చేసి విద్య గరపెను.

### కౌసల్యాదిరాణులు విగతశరీరులగుట

అప్పుడక్కడ— తెలివి దప్పి భూమిపై పడియున్న భూకాంతను గహన కాంతారములో యేకాంతముగా వదలి, లక్ష్మణుడు రథమెక్కి గృహోన్ముఖుడాయెను. అప్పటి రాకుమారుని మనోవ్యథ వర్ణనాతీతమైనది. శోక విహ్వలుడగు సౌమిత్రికి దారి పొడుగునా నానా విధముల దుఃఖోప శమన వాక్యములు చెప్పి వూరడించుటకు ప్రయత్నించెను. అట్లు దుఃఖ భారముతో ప్రయాణించి సుమిత్ర పుత్రుడు సాకేతపురి సమీపించెను. పిమ్మట అతడు రథము దిగి, సారథిని వీడ్కొలిపి, అవనతవదనుడై సాక్షాత్తు శోకమూర్తి వలె రాచ నగరములో ప్రవేశించెను.

సౌమిత్రి చిన్నగ కక్ష్యాంతరములు నడచి అంతిపురము చేరుకొనెను. అక్కడ కన్న తల్లులకు ప్రియ సోదరులకు "సీతామాతను అడవులలో విడచిపెట్టి నిర్దయుడనై తిరిగి వచ్చితిని" అని ముక్తసరిగా మూడు మాటల్లో చెప్పి, అచ్చోటు వీడి, ఏకాంతమునకు పోయి ఆక్రందించెను.

ఈ దారుణ సమాచారము తెలియగనే సమస్త సాకేత నగరి శోక సాగరమున బడెను. రాణీ వాసము గగ్గోలు చెందెను. పరిజన బంధుజనము వ్యసన వ్యాకులిత మాయెను. రాజాంతఃపురము వైదేహీ వియోగముతో శూన్యమై శ్రీహీనమై వెలవెలపోయెను. కౌసల్యా సుమిత్ర కైకేయి ఇంట తమ కూర్మికోడలు కాననముల పాలు చేయబడినదని తెలుసుకొని శోకాహతలై గుండెలు బాదుకొని రోదించిరి. హృదయ విదారకముగ దుఃఖాక్రాంతలై విలపించుచున్న దేవేరులను శాంతింప జేయుట రాజ పరివారమునకు దుష్కర మాయెను. ఆ దృశ్యము వర్ణింప వలవి కానిది.

# రామచరిత మానస్

అప్పుడు రామమూర్తి తమ్ములను వెంట బెట్టుకొని తల్లులను వోదార్చుటకై రాణి వాసమునకు వచ్చెను. మణిని పోగొట్టుకున్న సర్పము కరణి మమతా మయులగు తల్లులు వైదేహికై నెత్తి బాదుకొని యేడ్చుచుండిరి. ప్రేమ మూర్తులు దుఃఖ వివశులగు ఆ తల్లులను మాటలతో వోదార్చుట దుస్తరమని భావించి దాశరధి వారి దైన్య స్థితికి నంత జాలిగొనెను. పిమ్మట జగదభిరాముడగు శ్రీరాముడు మందస్మితుడై తల్లులకు తన దివ్య జ్ఞానము ప్రసాదించెను. ఇంతవరకు వారిని ఆవహించి యుండిన మాయ తెరవలె తొలగి పోయెను. మోహాంధకారము పటాపంచలయ్యెను. దివ్యకాంతితో వారి జ్ఞాన నేత్రములు ప్రకాశించెను.

అంతట ఆ ముప్వురు తల్లులు చిదానంద సంపన్నులై చేతులు మోడ్చి సుతుని రూపముతో తమ యెదుట ఉన్న శ్రీపతి నిట్లు స్తుతించిరి.

"అవతారమూర్తివైన ఓ జగత్స్వామీ ! ఇంతవరకూ మేము మాయా ధీనులమై నిన్ను మా కొడుకుగా మైథిలిని మా కోడలిగా భ్రమించి పామర దృష్టితో ప్రవర్తించితిమి. నీ కృపాదృష్టి వలన నేటికి మాకు జ్ఞానప్రాప్తి కలిగెను. మా అజ్ఞానాంధకారము నశించి సత్యము బోధపడెను. జ్ఞాన స్వరూపుడవగు ఓ లోకేశ్వరా ! మునులు దేని ప్రాప్తికై నిరంతరము అన్వేషించుచున్నారో ఆ పరమభక్తి తత్వమును మాకు ప్రసాదించుము."

ఇట్లు ఆ ముప్వురు తల్లులు దేవదేవుని దివ్య మహిమను కీర్తించి, ఆ పరమాత్ముని భక్తి ప్రసాదము పొంది యోగాగ్నిచే తమ శరీరములను దహింప జేసుకొని దివ్య లోకము చేరుకొనిరి.

రామాదులు తల్లుల శరీరావశేషములకు భక్తి శ్రద్ధలతో అగ్ని సంస్కారము చేసి ఉత్తర క్రియలు నెరవేర్చిరి. పిమ్మట కౌసల్యానుతుడు మణులు బంగారు వెండి వస్త్రములు భూములు గజాశ్వములు మున్నగు భూరిభూరి దానాదులతో బ్రాహ్మణ సమాజమును యాచక బృందమును సంతృప్తులను చేసెను. ఆ సమయమున స్వామికి— శంబూకుని వధించుట వలన, సీతా వియోగమువలన, తల్లులు స్వర్గస్థులైనందున కలిగిన అశాంతికై— అశ్వ మేధము చేయవలెనని సంకల్పము కలిగెను.

## అవధేశుని అశ్వమేధయజ్ఞ ప్రయత్నము

"ఏక బార గురుగృహ అవధేశా
గయే అనుజ సంగ సచివ ఖగేశా"

ఓ ఖగపతీ ! ఒక శుభ సమయమున అవధేశుడు అనుజామాత్య సమేతుడై గురు గ్రామమునకు పోయెను. రామాదులు వసిష్ఠుని పాద పద్మములకు ప్రణమిల్లి, వారి శుభాశీస్సులు గ్రహించి ప్రసన్నులయిరి. అనంతరము సచ్చిదానందుడగు రామచంద్రుడు చేతులు జోడించి నమ్ర వాక్కుల గురువులకిట్లు విన్నవించుకొనెను—

"గురువర్యా ! తమ శుభాశీస్సుల ప్రభావము వలన సాకేత రాజ్యము, సమస్త ప్రజ సకుశలము, తమ కృపాబలముచే ఇప్పటి వరకూ ఎన్నియో జపయాగ యజ్ఞములు శుభాంతముగా నిర్వర్తించి ప్రపంచములో కీర్తి నార్జించితిని. స్వామీ ! నాకింకొక కోరిక గలదు. అది యేమన, సకల విధ సంతాపములను హరించి, శుభములు సుఖములు ప్రసాదించు అశ్వమేధ హవనము చేయ సంకల్పించితిని. అవధ వాసులు సైతము ఆ యజ్ఞనము చూచి సంతోషించ వలెనని కుతూహల పడుచున్నారు. అందుకు తమరు అనుమతించి, ఆ యజ్ఞము నాచే నిర్విఘ్నముగ పూర్ణమగునట్లు ఆశీర్వదించకోరుచున్నాను."

సీతాపతి శుభ ప్రసంగమునకు మునివరుడు ప్రసన్నుడై ఇట్లు ప్రవచించెను—

"రామనృపా ! మంగళ కరమగు నీ సంకల్పము సర్వజనానందకరమైనది. సకలార్థ సాధకమగు హయమేధము శుభాంతముగా సాధించి సత్కీర్తి నొందుము." అని ఆశీర్వదించెను. పిమ్మట వసిష్ఠుడు భరతుని లక్షించి — "భరతా ! నేటి నుండియే క్రతు కార్యములు ప్రారంభించుము, అందుకు కావలసిన సంభారాదులు సిద్ధము చేయించుము, శుభ లేఖలు పంపించుము—" అని ఆదేశించి గురువు వారిని వీడ్కొలిపెను.

అవధేశుడు అశ్వమేధము చేయుచున్నాడను వార్త సర్వత్ర వ్యాపించెను. ఆ శుభ సమాచారము విని అంతిపుర జనులు ఆనందించిరి, సాకేత ప్రజ సంతోషముతో సంభ్రమించెను. దేవగణము దుందుభులు మ్రోగించి, గంధర్వాప్సరలు నృత్య గానముల చేసి, హర్షము ప్రకటించిరి.

భరత లక్ష్మణ శత్రుఘ్నుల ఆదేశము లందుకొని సచివులు, సేవకులు,— రాజోద్యోగులు, సాకేతవాసులు క్రతు కార్యములలో నిమగ్నులయిరి. పందిరులు వేసి, మండపములు గట్టి, చలివెందరులు బెట్టి, ధ్వజము లెత్తి, తోరణములు గట్టి, పథములు బాగుచేసి, గృహములలంకరించి అయోధ్యను అందచందముగా తీర్చిరి. సేవక బృందము సాధన సామగ్రి సేకరించుటలో నిమగ్నమాయెను. రథములు గుర్రములు ఏనుగులు భట వర్గము మొదలగు సేనాంగములు సమాయత్తము గావించ బడెను. అనేక మంది శిల్పులు రాత్రింబవళ్లు శ్రమించి మఖమండపము సుందరముగ నిర్మించిరి.

గురువుతో సంప్రదించి వారి సూచన ప్రకారము ఇంద్ర యమ వరుణ కుబేరాది దిక్పాలురను, నానా దేశాధీశులగు రాజన్యులను, కపికులోత్తములను, దానవశ్రేష్ఠులను, తీర్థవాసులగు మునీశ్వరులను, భూలోక సురలోక వాసులైన పండిత ప్రవరులను, బ్రాహ్మణ సమాజమును, బంధు వర్గమును, హయమేధోత్సవమునకు ఆహ్వానింపబడుచూ శుభలేఖలతో దూతలు పంపబడిరి. జనక భూపాలుని మిత్ర పుత్ర కళత్ర బంధు సచివ స్వజన సమేతముగా విజయము చేయవలసినదని ప్రార్థించుచూ వసిష్ఠుడు మిథిలాపురికి ప్రత్యేకముగా దూతను పంపెను.

ఇవ్విధముగా హవన నిర్వహణకై సకల ప్రయత్నములు జరిగిన పిమ్మట రఘు వంశ మణి రామచంద్రుడు గురు గ్రామము నుండి గురువుతో కలసి రాజధానికి వచ్చెను. అధ్వర క్రియ

లతో అలరారుచున్న అయోధ్య వైభవము చూచి బ్రాహ్మణులు పంతృప్తి చెందిరి.

ఇంతలో ఆహ్వానితులు అయోధ్యకు రాసాగిరి. వలపీల ద్వివిధమైందవసుగ్రీవాది కపికులము కిష్కింథ నుండి తరలి వచ్చెను. విభీషణాది రాక్షస మిత్రులు లంక నుండి చేరుకొనిరి. ఇంద్ర చంద్ర బ్రహ్మాది దేవతా గణము విమానము లెక్కి వచ్చెను. వ్యాస నారద భృగుపరాశర అగస్త్య అంగిరసాది మునిబృందములు గుంపులు గుంపులుగా సాకేత నగరి చేరుకొనెను. సనకాది సిద్ధులు విశ్వామిత్రాది సప్తర్షులు భూసుర బృందములు కదలి వచ్చెను. జనక భూపాలుడు రాణి వాసముతో రాజ పరివారముతో రథ గజ తురంగ పదాతులతో బంధుమిత్ర సార బృందముతో సకల రాజ లాంఛనములతో శతానంద సమేతుడై సంబరముతో సాకేత నగరి చేరుకొనెను. నానా లోకముల నుండి వచ్చిన అతిథులతో అయోధ్య క్రిక్కిరిసినట్లుండెను.

రామ భరత లక్ష్మణ శత్రుఘ్న సోదరులు సచివులు సాకేత ప్రముఖులు అతిథులను సకల మర్యాదలతో ఆహ్వానించి, వారికి తగు నివాసములు చూపెట్టి, ఆతిథ్యమిచ్చి, సత్కరించుచుండిరి. అతిథులను అయోధ్యా వాసుల ఆదర సత్కారములు, వారి మర్యాద మన్ననలు చూచి అహూతులు ఆనందముతో పరవశించిరి. అప్పటి అయోధ్య ఆనందోత్సాహము వర్ణింప నలవి గానిది.

శ్రీ గరుడా! అట్లు హయమేధ కార్యము లన్నియు సాంగముగా సమకూడిన పిమ్మట ఒక శుభ ముహూర్తమున యాగము వేదోక్త ప్రకారము ప్రారంభింప బడెను. రామప్రభువు నియమ నిష్ఠావ్రతుడై గురువుకు సాష్టాంగదండ ప్రణామము చేసి, వారి ఆశీస్సులు గ్రహించి, పదివేల మంది మునులతో, గురువుతో అధ్వరశాలకు వేంచేసెను.

మఖప్రారంభమునకు మునుపు — ముని బృంద పరివేష్టితుడై యున్న సీతాపతిని సంబోధించి వసిష్ఠుడిట్లనెను— "రామచంద్రా! నీవు గృహస్థుడవు కాబట్టి ప్రస్తుతము సపత్నీకుడవై యాగము చేయవలసి యున్నది. ధర్మపత్ని సమేతముగా చేయని క్రతు కర్మలకు ఫలము సిద్ధించదని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇది లోక విదితమైన సత్యము. కనుక ఇప్పుడు వైదేహి నీ వామ భాగమున ఉండవలసి యున్నది."

అని ముని పలికిన ధర్మ ప్రవచనము విని దాశరథి దవంతసేపు డోలాయమానస్థు డయ్యెను. పిమ్మట రఘురాత్ముడు మునివర్యుని అవలోకించి వినయోక్తుల ఇట్లనెను—

"గురువర్యా! నేను వివశుడను. నేను వైదేహిని వదలి పెట్టితిని. లోక మర్యాదకై నేనట్లు చేయుట ధర్మ సమ్మతమై యున్నది. కనుక యాగము యథావిధి సాంతము గావించుటకు ధర్మజ్ఞులైన మీరే తగు మార్గము నిర్దేశింప వేడుచున్నాను."

అని పలుకగా వసిష్ఠుడప్పుడు ఈ విషయమై నారద సనకాది మునీంద్రులతో సమాలోచించెను. అందుపై వారు సీతకు బదులు సీత వంటి బంగారు ప్రతిమను రాజుకు వామ భాగమున ఉంచిన చాలునని నిర్ణయించుకొనిరి. పిమ్మట ఒక సువర్ణ ప్రతిమ చేయించబడెను. మణిరత్నాభరణములతో సుందరముగా చెక్కబడిన ఆ స్వర్ణ ప్రతిమ సాక్షాత్తు సీతవలె శోభించెను. అపూర్వ కళా వైదగ్ధ్యముతో వెలసిన ఆ ప్రతిమను చూచి జనులు సీతాదేవినే చూచుచుంటిమని భ్రమించి పోయిరి. మంత్ర పూత గావించబడిన మైథిలి ప్రతిరూపము యజ్ఞ మండపమునకు గొనితెచ్చి శాస్త్రోక్తముగా పీఠమలంకరింపజేసిరి.

"మకర మాసరుతు సిసిర సుహాయీ
మఖ మండప బైఠే రఘు రాయీ
జటిత కనక సుందర మృగ ఛాలా
తిహి ఆసన ఆసీన కృపాలా"

శిశిరకాల— మకర మాస— శుభ దిన— శుభ లగ్న వేళ రఘూద్వహుడు యజ్ఞ వేదిక యొద్ద బంగారు జింక చర్మముపై శుభాసీను డయ్యెను. అప్పుడు సుందరులు, శుచివంతులు, వేదాంగ విదులు అగు రెండువేల మంది బ్రాహ్మణులు మంత్రోచ్చారణ చేయ సాగిరి. గురువు ఆదేశమును పొంది సౌమిత్రి అప్పుడు యజ్ఞాశ్వమును తెచ్చుటకు హయశాలకు పోయెను. అశ్వశాల నుండి లక్ష్మణస్వామి అరువది వేల మంది రణమల్లులు పదివేల మంది యుద్ధవీరులు వెంటనడవ, పట్టుపగ్గములు పట్టుకొని భటులు నడచుచుండ, మేళ తాళములతో యజ్ఞాశ్వమును నడపించుకొనుచూ మఖశాలకు వచ్చెను.. తెల్లని మేను నల్లని చెవులు నెమలి పింఛముతో సర్వ లక్షణ లక్షితమైన ఆ సైంధవము ధీర గంభీర గమనముతో చూపరుల దృష్టి నాకర్షించెను. మణి భూషణ పీతాంబరాదులతో అలంకృతమైన ఆది సూర్యుని రథాశ్వమువలె భగద్దాయ మానమై దీప్తిగాంచెను.

విశ్వామిత్ర వసిష్ఠాదులు చెప్పినట్లు క్రతుకర్త కాకుత్స్థమణి అగు కోసలాధీశుడు యజ్ఞ పశువుకు అభిషేక పూజాదికములు చేసి దాని లలాట భాగమున ప్రతిజ్ఞా పత్రము కట్టెను. "అరి భీకరుడు, బలపరాక్రమ మందు ఇంద్రాది కుడు, ఇనకుల రాజతిలకుడు — అగు అయోధ్యాధీశుని యజ్ఞాశ్వమిది; బలాధికులు దీనిని బంధించి ముమ్మెదుర్కొనవచ్చును. తదన్యులు మైత్రీ పూర్వకముగా మాతో సహకరించ వచ్చును." అని దాని మీద వ్రాయబడి యుండెను. దిగ్విజయార్థమై ఆ పట్టము గట్టినపుడు శంఖ భేరీ పటాహధ్వనులు దిక్కుల పిక్కటిల చేసెను.

## లవణాసురుని వధించుట

దాశరథి దిగ్విజ యార్థము పావనాశ్వము పంపుచున్నాడని తెలుసుకొని భార్గవు డాది ముని బృందము రామ చంద్రుని యొద్దకు వచ్చి— "ఓ రాక్షసాంతకా! లవణాసురుడను ఒక రాక్షసుడు కలడు. వాడు వరగర్వోద్ధతుడై లోక పీడన చేయుచున్నాడు. వానిని నిర్జించి సురలను భూసురులను రక్షించ వలసినది —" అని వేడుకొనిరి.

మహీధవుడు మునుల మొరలు విని జాలి గొనెను. రాఘవుడప్పుడు రాక్షసానుజుని రప్పించి లవణాసురుని వృత్తాంతము వినిపించమని కోరెను. అంతట దైత్యకుల భూషణ మగు విభీషణుడు శ్రీరామునికి లవణుని పూర్వోత్తరము లిట్లు విన్నవించెను:



"రాఘవా! నా సవతి తల్లికి ఒక కూతురుండెను. ఆమె పేరు కుంభీనస. మా అన్న దశాననుడు ఆమెను మధుడను రాక్షస రాజుకిచ్చి పెండ్లి చేసెను. ఆ మధు కుంభీనసలకు పుట్టిన వాడే ఈ లవణాసురుడు. ఈ దుర్మార్గుడు శివదత్తమగు త్రిశూల ప్రభావముచే అజేయుడై ఋషి వరమునులను బాధించుచున్నాడు. దేవా, త్రిశూలము వాని చేతులో నున్నంత వరకు వానిని నిర్జించుట దుష్కరము."



ఈ ప్రకారము లంకాధిపుడు మధుపుత్రుని పుట్టు పూర్వోత్తరములు వాని లావు బలములు రణ రహస్యములు విపులముగా తెలియ జేసెను. తదుపరి దాశరధి తన లఘు సోదరుని బిలిచి—"శత్రు హంతకుడవగు ఓ శత్రుఘ్నా! నీ విప్పుడే సైన్యముతో వెళ్లి, లవణాసురుని వధించి సుర భూసురులకు సంతోషము కలుగ జేయుము—" అని ఆదేశించెను. అప్పుడు రఘుపతి తన దివ్యాస్త్రమొకటి తమ్మునికిచ్చి, దాని ప్రయోగ ఉప సంహారాది మంత్ర రహస్యములు తెలియ జేసి విజయుడవై రమ్మని దీవించి పంపెను.

శత్రుఘ్నుడు తన పుత్రులను వెంట బెట్టుకొని, వీరభటాళితో వివిధాస్త్రములతో చతురంగ సేనావాహినితో విజయ సూచకముగా మూడు యుద్ధ నగారాలు మ్రోయింప జేసి శాత్రవ సంహారమునకై యజ్ఞాశ్వముతో ప్రస్థానముచేసెను.

పండ్రెండు రాత్రులు ప్రయాణించి వారు యమునా తీరము చేరుకొనిరి. యమునకు శ్రద్ధాంజలి ఘటించి, మహాదేవుని పూజించి, అచ్చట నుండి పురోగమించి శత్రుఘ్న సైన్యము శాత్రవ నగరమగుమధుపురిని భయంకరముగా ముట్టడించెను.

పగతురభేరి కారావము చెవుల బడగనే లవణాసురుడు ఆగ్రహోదగ్రుడై, ప్రళయ భయంకరముగా ప్రతిరణ ధ్వని గావించి, కాటుక కొండల వంటి కాకలు దీరిన అరువది వేలమంది వీరభటులతో కదలి వచ్చి శత్రు సైన్యమును దార్కొనెను. ఇరు పక్షములకు హోరాహోరి ఘోర సంగ్రామము సంఘటించెను. లవణుని కొడుకులు మాతంగుడు, అఖండకేతుడు గుండెలు దీసిన బంట్లు. వారు బలోద్ధతులై బట్బార్చి శత్రుఘ్నుని పుత్రులగు సుబాహు— యూపకేతులను దాకిరి. అప్పుడా నరాంతక రాక్షసాంతకులకు జరిగిన ఘోరాహవము లోక భీకరముగా నుండెను. అవక్ర పరాక్రమోపేతులగు శత్రుఘ్న పుత్రులు రోషోద్రిక్తులై విజృంభించి, కేతుమాతంగులను తెగటార్చి, వారి శరీరములను ఖండఖండములుగా ఖండించి శాత్రవ భయంకరముగా సింహనాదము చేసిరి.

కొడుకులు క్రూరముగా మడిసినందుకు దైత్యుడు కుపితుడై బలికేక పెట్టి, వివిధ మారణాయుధములు ధరించి శత్రుఘ్నుని కటకముపై పిడుగువలె పడెను. సాకేత యోధులు సమానముగా పరాక్రమించి అసురుల ఆక్రమణను అరికట్టిరి. దనుజులంత ప్రత్యక్షముగా పోరాటాలు చాలించి అంతరిక్షము నుండి మాయా యుద్ధము చేయుటకు పూనుకొనిరి. శత్రుసూదనుడు క్రోధోద్విగ్నుడై దివ్యాస్త్ర మొకటి సంధించి సమంత్రముగా దానిని నిశాటుల మాయా నటనపై ప్రయోగించెను. ఆ యస్త్రరాజము నుండి లక్షోప లక్షల బాణములు ఉద్భవించి, అవిశాఖోప శాఖలుగా విస్తరించి, తరణి కిరణ సమూహము తిమిరమును శోషింప జేయునట్లు రాక్షస మాయను చిన్నా భిన్నము చేసెను. నక్తంచర బలము నిట్లు నిర్జించి రఘు సోదరుడు ప్రచండ గదాఘాతముతో లవణాసురుడు ధరాగతుడై మూర్ఛిల్లునట్లు చేసెను. (సశేషం)

## వియత్నాం విశేషాలు

17 వ పేజీ తరువాయి

తాలు అంతా సుళువుగా, చౌకగా కన్నులకు ఇంపుగా ఉండే విధానంలో తయారు చేసినవి వాడు కుంటారు. కాలికి జోళ్లు లేకుండా ఎవరూ నడవరు. మన దేశంలోలాగా ''ముష్టి'' కనబడదు, ఎవరో ముసలి, గ్రుడ్డివాళ్లు తప్ప. సామాన్యంగా భోజనం ఒక ఇంటిలో 4 గురు ఉన్నా, పూటకు రెండు రూపాయలతో ముగించగల్గుతారు. బయటకు వచ్చినప్పుడు మాత్రం రెస్టారెంటులలో తిన్నప్పుడు ఖర్చు పెడతారు. విందులూ, వినోదాలూ అంటే బహు సరదా. పట్టణ అలంకరణ, షాపులలో డెకరేషను, వస్తువుల అమర్పు చాలా ముచ్చట గొల్పుతూంటాయి. ప్రతివారికి 'ఈత' ఈదుట చాలా సరదా. ఆడ, మొగా, పిన్నా పెద్దా అంతా నదులలో కాకపోయినా, పట్టణాలలో ఉన్న 'ఈత కొలనుల' లో తప్పక ఈదుతుంటారు. మనవాళ్ల కున్నంత 'సిగ్గు' పడక, ఆడపిల్లలు గూడా సరదాగా ''ఈత బాడీలు'' వేసుకుని చక్కగా యీదుతారు. వారికి సంగీతం అంటే చాలా యిష్టం. అక్కడ గూడా పాట కచేరీలు, నాటకాలు, యువక సభలూ జరుగుతూంటాయి. వాళ్లు, లక్క, కర్ర పనిలో చాలా గట్టివారు. దంతంతోటి, కొమ్ముతోటి, లక్కతోటి, మదర్ ఆఫ్ పెర్ల్‌తోటీ చక్కని కళానైపుణ్యంతో పెట్టెలు, వస్తువుల పెట్టెలు, పౌడరు పెట్టెలు, కళ్లజోళ్ల ఫ్రేములు, ఫోటో ఆల్బములు, సిగరెట్టు పెట్టెలు, బొత్తాలు, హైపిన్నులు, డ్రెస్సింగ్ సెట్లు మొదలగు అనేకరకాల వస్తువులు చేస్తూంటారు. అవి బాగా ప్రసిద్ధికెక్కినవి. విదేశీయులు అవి ఎక్కువగా కొని వాళ్ల వాళ్ల దేశ పర్యటన జ్ఞాపకార్థం పెట్టుకుంటారు.

మనం గోడలకు వేసే వెదురు చాపలమీద చక్కని డిజైన్లు పెయింటింగుతో వేసినవి డ్రాయింగు రూముల్లో పెట్టుకోడానికి చలామణీ అవుతూంటాయి. ఇవిగాక, చక్కని డిజైన్లు వేసిన తివాసీలు చేస్తారు. వారికి విజ్ఞానాభిలాష, పూర్వగ్రంథాలూ, సాంప్రదాయాలూ అంటే చాలా గౌరవం. వారి భావి పురోభివృద్ధికి కావలసిన పరికరాలు అన్నీ వాళ్లకు ఉన్నాయి. ఫలవంతమైన దేశం, చతురత గల్గిన ప్రజానీకం, విజ్ఞానాభిలాష, అనాదిగా ఉన్న నాగరికతా సౌశీల్యం వారిని, ఆచిరకాలంలోనే, ఈ రాజకీయ గొడవలు వైదొలగి, ఏక రాజ్యముగా రూపొంది, వాణిజ్య విద్యా, పరిశ్రమ రంగాలలో సర్వతోభివృద్ధి పొందాలని, ఆశించుదాము. వారికి ఆ చైతన్యం కలిగి బహుముఖంగా పురోభివృద్ధికి భగవంతుడు తోడ్పాడాలని మాకోరిక. ★

## మనసున మల్లెలు

25 వ పేజీ తరువాయి

అటూ, ఇటూ కాస్సేపు పచారుచేసి, మహారాజులు ఎలా నడుస్తారో అలా నడవడం అలవర్చుకోమన్నాడు. దానికి జవాబుగా గిరిబాబు ''నాకు తెలుసునోయ్ తమ్ముడు. అసలు నా వేషం చూసి పెద్ద పెద్దవాళ్లే మెచ్చుకున్నారు. నువ్వే చూస్తావుగా, ప్రేక్షకుల్ని ఎలా ఆకట్టే నా ప్రజ్ఞ చూపిస్తానో. స్టేజిమీదకు ప్రవేశించిన రెండు నిముషాలు మాత్రం కాస్త భంగారూ వణుకుగా ఉంటుంది. ఆ సమయంలో నువ్వు వెనుక నుంచి రెండు ముక్కలు అందించావంటే, ఇహ అక్కణ్ణుంచి చూసుకో, తుఫాన్ మెయిలులా పరిగెట్టుంది నుకో మన నటన'' అన్నాడు. ప్రసాద్ ఆయన మాటలు వింటూ ఆయనవైపు చూస్తుంటే, వెనకాల నుంచి ''ఏమండీ, మా పిల్లల మేకప్‌కి కాస్త పౌడరిస్తారా ?'' అని ఎవరో అడుగుతున్నట్లు విన్పించి, వెనుకకు తిరిగేసరికి ప్రసాద్‌కు తను రెండు రోజుల క్రితం స్టేషనులో చూసిన దగ్గర్నుంచి,మళ్లీచూడాలని,మాట్లాడాలనీ ఎవరికోసం తహతహలాడిపోతున్నాడో ఆ అమ్మాయికన్పించింది.

కమల కూడా ప్రసాద్‌ను చూసి సంతోషంతో ''మీరా ?'' అంది.

ఆ సమయంలో స్టేజీమీద మీటింగు ప్రారంభిస్తూ హెడ్మాష్టరు దాశరథిగారు ''సోదరసోదరీమణులారా ! ఈనాటి సభకు శ్రీ సోమనాధం ఎం. ఎల్. ఏ. గారిని అధ్యక్షత వహించమని కోరుతున్నాను'' అనేసరికి ప్రేక్షకులలోనుండి సోమనాధంగారు స్టేజి ఎక్కి అధ్యక్షస్థానం అలంకరించడం, ఆ సందర్భంలో ఒక టీచరు ఆయన మెడలో పూలమాల వెయ్యడం, వెంటనే అందరూ చప్పట్లు కొట్టడం జరిగింది. తరువాత హెడ్మాష్టరుగారు ''నేటి సభలో మాట్లాడుటకు శ్రీ లక్ష్మణదాసుగారిని కోరుచున్నాను'' అనడం ఆయన స్టేజీమీదకు రావడం, పూలమాలా చప్పట్లు కార్యక్రమం జరిగింది. ''శ్రీ లక్ష్మణదాసుగారి గురించి ఒక్క ముక్క చెప్పదల్చుకున్నాను. మీలో చాలామందికి ఆయన గురించి తెలియకపోవచ్చును. కాని ఆయన మన స్కూలు కమిటీ అధ్యక్షులైన సోమనాధం గారికి బావగారి అల్లుడు ''(చప్పట్లు)'' అంతేకాక ఆయనకు హోమియోపతి వైద్యం బాగా తెలును. కాబట్టి వారి గొప్ప వేరే చెప్పక్కర్లేదు'' (చప్పట్లు.) దాశరథిగారికి హోమియోపతి వైద్యం అంటే చాలా గురి. దానిని నేర్చుకోవాలని కూడా ప్రయత్నం చేస్తున్నారు. ఆయనకు ఏభైఏళ్లుంటాయి. తల పూర్తిగా నెరిసిపోయింది. ఆయన మనిషి చాలా పొడగరి. ఆయనది పొడవైన ముక్కు. అవాళ పంచెమీద, పొడుగాటి కోటు వేసుకున్నారు. సభనంతనీ ఒకసారి పరకాయించి చూశారు.

సభ అంతా, ఏడెనిమిదేళ్ల వయసు నుండి పదిహేనే



## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

# మనసున మల్లెలు

నేళ్ల వయసు గల బాలబాలికలతో క్రిక్కిరిసి ఉంది మొదటి రెండు మూడు వరుసలలోనూ పెద్దవాళ్లు కన్పిస్తున్నారు ఆడవాళ్ల స్థలంలో మాత్రం చాలామంది పెద్దవాళ్లు కన్పిస్తున్నారు వెనుక వరుసలలో కొందరు చుట్టు ప్రక్కల వూళ్ల నుండి వచ్చిన జనం కన్పిస్తున్నారు పిల్లలకు మాత్రం స్టేజిమీద ఏం జరిగినా చప్పట్లు కొట్టాలనే ఉత్సాహం అమితంగా ఉంది స్కౌట్సుగా ఉన్న కొందరు విద్యార్థులూ, ఇద్దరు ముగ్గురు టీచర్లూ, జనానికి కూర్చొనేందుకు స్థలం చూపిస్తూ జనాన్ని సర్దుబాటు చేస్తున్నారు

హెడ్మాష్టరుగారు తమని పరిచయం చెయ్యడం అయ్యాక, అధ్యక్షులు సోమనాధంగారు తమ అధ్యక్షోపన్యాసం ప్రారంభించారు ఆయన ఈ హైస్కూలు రామనగరానికి తెప్పించడానికి ఎంత కష్టపడ్డారో, ఎంత త్యాగం చేశారో వివరించి చెప్పారు. తన జీవితమంతా ప్రజాసేవకి ఎలా ధారపోసారో, పిల్లలకు తెలియజెప్పారు తాము చదువుకున్న రోజులలో చండశాసనుల లాంటి మేష్టర్లుండేవారని, గోడకుర్చీలు వేయించడం, చావ బాదడం, గుంజీలు తీయించడం మొదలైన కఠినశిక్ష లుండేవనీ, ఇప్పట్లా పిల్లలంటే మీద చెయ్యివేస్తే ఒప్పుకోని తలిదండ్రులు అప్పుడు లేరనీ, చదువు రావాలంటే విద్యార్థి నడ్డిమీద రోజుకో పేంబెత్తం విరగాలనీ, అలా లేకపోవడం వల్లనే విద్యా ప్రమాణాలు తగ్గిపోతున్నా యన్నారు విద్యార్థులకు టీచర్లంటేనూ, దేశనాయకులంటేనూ చాలా గౌరవం ఉండాలన్నారు స్వతంత్రం రాకముందు దేశ నాయకులమీద ప్రజల కున్న భక్తి, స్వతంత్రం వచ్చాక లేదన్నారు ఆ రోజుల్లో దేశనాయకు లవ్వాలంటే లాఠీ దెబ్బలు తిని, జైలుకెళ్లి, అనేక కష్టాలు పడితేనే గాని సాధ్యమయ్యేదికాదు కానీ ఈ రోజులలో చాలా మంది ఎంతో సులభంగా నాయకులై పోతున్నారని వివరించారు అది ఎప్పటికీ మంచిది కాదని ఉద్ఘాటించారు. తమలాంటి అష్టకష్టాలూ పడ్డ నాయకులకే ప్రజలు మద్దత్తు ఇవ్వాలన్నారు ముఖ్యంగా విద్యార్థులు ఈ విషయం గుర్తుంచుకోవాలని చెప్పి తను ఉపన్యాసం ముగించారు ప్రజలు చప్పట్లు కొట్టారు తరువాత, హెడ్మాష్టరుగారు ఒకసారి లేచి మైకు వద్దకు వచ్చి శ్రీ లక్ష్మణదాసుగారు మాట్లాడతారనీ, పిల్లలందరూ నిశ్శబ్దంగా ఉండాలని కోరారు లక్ష్మణ దాసుగారు లేచి, మైకువద్ద నిల్చుని ఉపన్యాసం ప్రారంభించారు ఆయన చిన్ననాటి ముచ్చట్లు ప్రారంభించి, ఆ రోజులలో తను చాలా శ్రద్ధగా చదువుకునేవాణ్ణనీ, తను ఎంతో బుద్ధిమంతుణ్ణనీ చెప్పారు ఇంకా తన జీవిత చరిత్రలోని ముఖ్య ఘట్టాల్ని ఒకొక్కటే తీరికగా వివరించసాగారు

గ్రీన్ రూములో కమలను చూసిన దగ్గర్నుంచి ప్రసాద్ ఆమెతోనే మాట్లాడుతూ, ఆమెతో వచ్చిన బాలికల మేకప్‌లో ఎంతో సహాయం చెయ్యడం మొదలెట్టాడు గిరిబాబుగారు మళ్లీ మళ్లీ తన పోర్షన్ చదువుకుంటూ, పచార్లు చేస్తూ ప్రసాద్, కమలయందు చూపుతున్న శ్రద్ధను గమనించాడు కమల కూడా ప్రసాద్‌తో ఉత్సాహంగా మాట్లాడడం అతనికి అంత రుచించ

# మనసున మల్లెలు

లేదు నృత్య ప్రదర్శన చేయవలసిన పి... అందరూ తమ వేషాల్ని ధరిస్తూ ఉంటే ప్రసాద్ వాళ్ళకు పౌడరు వేసుకోవడంలోనూ, పిన్నులు పెట్టుకోవడంలోనూ, వాళ్ళకు కావలసిన వస్తువు లందివ్వడంలోనూ సాయంచేస్తూ కమలతో మాట్లాడసాగాడు కమల కూడా తనకు మంచి సమయంలో ప్రసాద్ సాయం లభించినందుకు చాలా సంతోషించింది "మీరు ప్రోగ్రాముకు వస్తారని నాకు తెలియదు" అంది

"నాకూ మీదొక ప్రోగ్రాము ఉందని తెలియదు మొన్నటినుంచీ మీరు మళ్ళీ కన్పిస్తారేమోనని చూశాను ఎక్కడా కన్పించలేదు. అదృష్టవశాత్తూ మనం ఇక్కడ కలుసుకోవడం జరిగింది"

"నేను రోజూ సాయంకాలం అయిదు గంటలకు టైపు ఇన్స్టిట్యూటుకి వెళ్ళి మళ్ళీ ఆరున్నరకల్లా తిరిగి వచ్చేస్తున్నాను వచ్చేటప్పుడూ, వెళ్ళేటప్పుడూ కూడా స్టేషనంతా పరకాయించి చూస్తున్నాను కానీ మీ రెక్కడా కన్పించలేదు."

"అరెరె నాకా సంగతి తెలియదు సుమండీ. నేను ఏమీ తోచక రోజూ సాయంకాలం నాలుగు గంటలకు బయల్దేరి ప్రక్క స్టేషను వద్దకు మూడు మైళ్ళు షికారుగా నడిచి వెళ్తున్నాను అక్కడ ఏటి ఒడ్డున చాలా సరదాగా ఉంటుంది ఆ ఇసుక దిబ్బలూ, కొబ్బరిచెట్లూ, పొలాలూ చూస్తూ సాయంకాలం వరకూ కాలం గడిపి తిరిగి వస్తున్నాను"

ఒక స్కూలు టీచరుగారు హడావుడిగా గ్రీను రూములోకి వచ్చారు వస్తూనే, "ఏమమ్మా కమలా మీ పిల్లల వేషధారణ అయిందా ? మీరు సిద్ధంగా ఉన్నట్లేనా ? ఇంక ఆట్టే టైము లేదు" అని అడిగారు కమల తను సిద్ధంగానే ఉన్నాననీ, పిల్లల వేషధారణ కూడా అయిందనీ చెప్పింది తరువాత ఆయన గిరిబాబుగారి వద్దకు వెళ్ళి "మీరూ సిద్ధంగా ఉన్నారు కదా ?" అని అడిగారు ఆయన అవునన్నారు ఇంతలో నాటికా మొదలైన ఇతర ప్రోగ్రాములలో పాల్గొనేవారు రావడం మేకప్ చేసుకోవడం ప్రారంభించడం జరిగింది. టీచరుగారు వెళ్ళిపోయారు.

తరువాత రవికుమార్ వచ్చి చెల్లెల్ని ఆమె సిద్ధంగా ఉందో లేదో కనుక్కున్నాడు "ఆడియన్సంతా మీ ప్రోగ్రాము కోసం ఎదురు చూస్తున్నారు లైటింగ్ ఏర్పాట్లన్నీ సరిగ్గానే ఉన్నాయి" అన్నాడు కమల అక్కడ నుల్చున్న ప్రసాద్‌ని చూపిస్తూ, "వీరే అన్నయ్యా, మొన్న స్టేషనులో మాకు సాయం చేసింది" అంది. రవికుమార్, ప్రసాద్‌ను చూసి "ఓహో, అలాగా థాంక్స్" అని "మీ పేరు ?" అని అడిగాడు.

ప్రసాద్ తన పేరు చెప్పి "గ్లాడ్ టు మీట్ యూ" అని కరస్పర్శ చేశాడు. ఆయన ఏం చేస్తున్నదీ రవికుమార్ అడగ్గా, ప్రస్తుతం తను ఉద్యోగాన్వేషణలో ఉన్నాననీ అంతవరకూ 'కేరాఫ్ ప్లాట్‌ఫారం' అనీ చెప్పాడు రవికుమార్ వెంటనే స్టేజి వద్దకు వెళ్ళిపోయాడు. (సశేషం)

మునిగిపోయారు. చర్చిలలో ప్రార్థనలు జరిగి నాయి. జాతీయ పతాకాలన్నీ సగం వరకు దిగిపోయి నాయి అంతా వెలవెల బోతున్నారు

అక్కడ ఢిల్లీలో జరుగుతున్న పండిట్జీ అంతిమయాత్ర ప్రత్యక్ష వ్యాఖ్యానం వింటూ మధ్యాహ్నం పన్నెండు మొదలు సాయంత్రం అయి దింటిదాకా, రేడియో సెట్ల దగ్గరే ప్రజానీకం ఉండి పోయింది. సాయంత్రం నాలుగుంబావు అవుతూండగా, అనుకోని పెనుగాలి వీచింది కాస్త జల్లు పడింది. అక్కడ ఢిల్లీలో, నెహ్రూ మనవుడు, అంత్యక్రియుల కోసం ముందుకు వెడు తున్నాడని, రేడియోలో వినిపించింది కరెంట్ పోయింది మళ్లీ పదిపదిహేను నిమిషాల దాకా రానేలేదు మళ్లా రేడియో ఎప్పుడు వినిపి స్తుందా అని ఆదుర్దాగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాం, ఇంతలోకే, ఆయన భౌతికకాయం, పంచభూతాల్లో లీనమయిపోయినట్లు తెలిసింది దేశదేశాల్నుంచి, ప్రముఖులు రెక్కలు కట్టుకుని గాలారు. సంతాప సందేశాలు, లెక్కలేనన్ని వచ్చి డుతున్నాయి ప్రత్యక్షంగా రాలేని ప్రముఖులు మ విచారాన్ని, హృదయ విదారకమైన మాటల్లో లియపరిచారు ఆయన ఎయస్సు డెబ్భై నాలు ళ్లు 1947, ఆగస్టు 15 నుంచి, మన భారత దేశానికి ప్రధాన మంత్రిత్వం వహిస్తూ వచ్చారు ఆరోగ్యం దెబ్బతిన్నా, విరామం లేకుండా, ఎన్నో బాధ్యత గల పనుల్లో, మనస్సును చొప్పిస్తూ, భరింపలేని భారాన్ని మోస్తూ వచ్చారు ఇన్ని బాధ్య తలు తప్పించుకోమని, అతి ముఖ్యులు, స్నేహితులు సలహాఇచ్చినా, చిరునవ్వు నవ్వివూరుకున్నారు బాధ్య తల బరువుకి భయపడి, పారిపోయి ఎక్కడో దూర్చో కూడదని ఆయన భావన

భారతదేశానికి ప్రధాని అయినప్పటినుంచి, నవభారత నిర్మాణానికి అహర్నిశలు పాటుపడ్డాడు ఇతర దేశాలతోపాటు తలెత్తుకు తిరగాలని, ఎన్నో కలలు కన్నాడు అందువలనే అఖండ మానవాళి శ్రేయస్సు కోసం, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల పరి రక్షణ కోసం పాటుపడుతున్న అగ్రశేణి నాయ కుల్లో జవహర్‌లాల్ అత్యంత ప్రధానమైన వ్యక్తి అని ప్రపంచ మంతటా గుర్తించటం జరి గింది. ఆయన్ని యుగ పురుషుడుగా శ్లాఘించటం జరిగింది ఆయన లేనిలోటు భర్తీ చెయ్యటమనే ప్రశ్నేలేదు ఆయన మహోన్నతమైన హిమవత్పర్వ తము లాంటి వాడు ఆ పర్వతాన్ని పెళ్లగించినవాడు అగాధమైన లోయ ఏర్పడక మానదు

జవహర్‌లాల్, ముళ్లులేని ఎర్రగులాబి లాంటి వారు. తెల్లటి డ్రస్సుతో ఆయనెంత స్వచ్ఛంగా కనబడేవారో, ఆయన మనస్సు-కూడా మల్లెపువ్వు లాగ అంత నిర్మలమైనదే ! ఆ ఎర్రగులాబి వాడి పోయి, మనల్ని వీడిపోయింది కాని ఆయన మూర్తి ప్రతి పసిపాప నవ్వుల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది మనం చేసే ప్రతి మంచిపనిలోనూ ఆయన ఆశయం ప్రతిబింబిస్తుంది.

* * *

ఓనెల రోజుల బట్టీ, నగరంలో 'ఫ్రీస్టైయిల్' కుస్తీలు, వాటి తాలూకు పోటీలు జరుగు తూనే ఉన్నాయి. ఇద్దరు మనుష్యులు, బహిరం గంగా, ఒకర్నొకరు దారుణంగా హింసించుకుం టుంటే, చూడాలని సరదా పడి, ఎంతో మంది

# రాజధాని కబుర్లు

11 వ పేజీ తరువాయి

జనం "కుస్తీలకు" వెళుతున్నారు ఒక్కొక్క ప్పుడు ఆ దృశ్యాలు మహా భయంకరంగా కూడా కనిపిస్తూ ఉంటాయి అయినప్పటికీ, కళ్లు మూసుకుంటూ, తెరుచుకుంటూ, వాటిని చూస్తూ ఆనందపడుతూ ఉంటారు. ఇవన్నీ కళ్ల యెదుట ప్రత్యక్షంగా కనబడేవి. ఇక తెరవెనక 'కుస్తీలు' చిత్ర విచిత్రంగా ఉంటాయి పిటిల్లో పోటీ పడి పీటీ అయిన వాళ్లంతా ఏ పార్టీ, తాత్కా లికంగా గెలిచిన వాళ్లంతా ఏ పార్టీ, నగర మునిసి

# రాజధాని కబుర్లు

పల్ ఎన్నికలలో కాంగ్రెసు వారు ప్రసాదించిన 'టిక్కెట్ల'ను భద్రపరుచుకుంటూ ఆ వర్గం వారంతా వో సమావేశం జరుపుకున్నారు కాంగ్రెసువారి తీక్షణ దృష్టులకు గురి అయిన కాంగ్రెసు కార్పొరేటర్లు ఇంకో సమావేశం జరుపుకుని ముందు కార్యక్రమాల్ని ఆలోచిస్తున్నార్శు. కొంతమంది పార్టీలు మార్చుకుని కాంగ్రెసు టిక్కెట్లు కోసం తాపత్రయ పడుతున్నారు. ప్రతిపక్ష పార్టీలలో టిక్కెట్లు కోసం కుస్తీలు పట్టటమంటూ కనపడటం లేదు

ఇక మంత్రి పదవుల కోసం పోటీ పడటం కూడా మామూలుగానే జరిగి పోయింది ఎన్నో వూహాగానాలు వ్యక్త మయినాయి కాని ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రిగారు, శ్రీ తోట రామస్వామి గార్ని మాత్రం, మంత్రిగా చేసి వూరుకున్నారు. మరి మిగతా వాళ్ళ మాటేమిటి ? అది ప్రశ్నార్ధకంగానే నిలిచి పోయింది దానికి తోడు, ముఖ్య మంత్రిగారు కూడా అననే అన్నారు వేచి చూడండి, ఇప్పుడేమి చెప్పలేనని. తూర్పు గోదావరిజిల్లా పరిషత్తుకు అధ్యక్ష స్థానం వహిస్తూ వచ్చిన రామస్వామి గారికి మంత్రి పదవి రావటం, అనేక కారణాల వలన చాలా మందికి సంతృప్తి కలిగించిందని అనుకుంటున్నారు ఇప్పుడే మంత్రి వర్గ శాఖల పునర్విభజన కూడా జరిగింది. దీంట్లో కొన్ని మంచి మార్పులు జరిగినాయి దేవాదాయ ధర్మాదాయ శాఖలను శ్రీమతి సదాలక్ష్మి గార్ని నుండి తొలగించటం, శ్రీ ఆలపాటి వారికి అప్ప చెప్పటం అప్పుడే వీరు ఉత్సాహంగా మాట్లాడేశారు రాష్ట్రంలో ఉన్న గుళ్లు కొన్నింటికి 'రంగు' వేయిస్తామంటూ, ఇంకో ముఖ్యమైన మార్పు డాక్టరు చెన్నారెడ్డిగారికి, ఆర్థిక శాఖ అప్పచెప్పటం. అతి చొరవ, చనువు చేసుకుంటూ ప్రతి రంగం లోనూ ధైర్యంగా ముందంజవేయు సమర్థత గల చెన్నారెడ్డిగారు ఈ కొత్త బాధ్యతను కూడా రాణింపుగానే నిర్వహించ గలరనటంలో సందేహం లేదు వీటన్నింటికంటె, సాహితీపరులకు సంతోషదాయకమైనది శ్రీ ఎం ఆర్ అప్పారావుకు సాంస్కృతిక వ్యవహారాలను అప్పచెప్పటం ఈ శాఖా అదివరకు లేదు కొత్తగా దీన్ని యేర్పాటు చెయ్యటం, అందులోనూ అప్పారావుగారికివ్వటం ఎంతైనా సముచితంగా ఉంది సాహిత్య, సంగీత, నాటక, లలిత కళా అకాడమీ వ్యవహారాలు, ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల కార్యకలాపాలు ఇతర సాంస్కృతిక, క్రీడా సంబంధమైన విషయాలను వీరు శ్రద్ధతో పరిశీలించటానికి అవకాశం కలిగింది ప్లానింగ్, భారీ పరిశ్రమలను, ముఖ్య మంత్రిగారు తీసుకున్నారు శ్రీ బి. వి గురుమూర్తికేమో సమాచార శాఖ ఇచ్చారు పాపం పరిశ్రమల శాఖను మాత్రం, డాక్టర్ యమ్. యన్ లక్ష్మీనరసయ్యగారు కోల్పోయారు అదనంగా వచ్చిన బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించ గలిగితే, ముఖ్య మంత్రిగారు ఉంచిన విశ్వాసానికి అర్హులయిన వారవుతారు

ఐ. ఎల్. ఎన్.★

ఆడంబరాలను విడనాడండి
దేశసంపదను వృధా కానీయకండి —

# సరాగమాల — వి. ఎ. కె. రంగారావు

ఇటీవల వచ్చిన చిత్రాలలో "అమరశిల్పి జక్కన్న"లో సంగీతం, సాహిత్యం ఉత్తమోత్తమంగా ఉంది. దీనికి కారకులు రాజేశ్వరరావు సంగీత దర్శకులు, సి. నారాయణరెడ్డి, సముద్రాల సీనియర్, కొసరాజు, దాశరథి, పాటల రచయితలు. ఒకో పాటను వేర్వేరుగా పరిచయం చేసే ముందు స్థూలంగా ఈ చిత్రంలోని సంగీతం గురించి రెండు మాటలు.

కొందరు శ్రోతలు వ్రాశారు, "మల్లీశ్వరి" అంత మధురంగా, అంతటి ఉన్నత స్థాయిలో "జక్కన్న"లో సంగీతం ఉంటుందని ఆశించాం. తీరా విన్న తరువాత చాల నిరుత్సాహకరంగా ఉందనుకున్నాం. రాజేశ్వరరావ్ మా ఆశలను అడియాసలను చేస్తే ఇంకెలా ?

ఇందులో పొరపాటు రాజేశ్వరరావుది కాదు. మీది. కేవలం సంగీత దర్శకుని వలన ఎంత ఫలితం చేకూరుతుందని మీ ఉద్దేశం ? అందులో బి. ఎన్. రెడ్డి, భానుమతి, దేవులపల్లి కృష్ణశాస్త్రి : ఇందరితో యేరీ ? అదీగాక "మల్లీశ్వరి"లో పాటల స్థానాలు అన్నీ ఉదాత్తమైన సన్నివేశాలు. నాయికా నాయకులపై చిత్రించబడ్డవి చాలమట్టుకు. సంగీతనవి, రాధామాధవుల ప్రణయలీలను స్తుతించే నృత్య గీతాలు. ఒక భ్రమర గీతం. ఆదిలో వినాయక స్తుతి. మధ్యలో ఒక కైవార గీతి. తుమ్మెద పాట, కైవార గీతం కొంచెం తక్కువ స్థాయిలో ఉన్నదని ఆ నాడే ప్రేక్షకులనుకొన్నారు. అన్నారు. కాని "జక్కన్న"లో అలా కాదు. క్షుద్ర పాత్ర అయిన ఒక గుంపుపైన ఒక నృత్య గీతం, హాస్య పాత్రంపైన ఒక నృత్య గీతం, ఇవి ఉత్తమ పాత్రంపై చిత్రించబడిన పాటల స్థాయికి రమ్మంటే ఎలా వస్తాయి ? ఈ భేదాను మనసులో ఉంచుకొని, మొదట చెప్పిన తారతమ్యాలకు (దర్శక, నాయిక, రచయితల) వదల వలసినంత పరిధి వదలి వేస్తే "మల్లీశ్వరి"లో సంగీతానికి మరీ వెనుక బడదు "జక్కన్న"లో సంగీతం.

ఇక మరొక ప్రశ్న. ఇదీ పాఠకులదే. కొన్ని పత్రికలలో వేసినట్లు నిజంగా ఆ నాటి జంత్ర సమ్మేళనమునే పాటల్లో వాడినారా ? కథాకాలం సుమారు తొమ్మిది వందల యేళ్ల క్రిందటిది. ఈ నాటి వాద్య విశేషాలు ఆ నాడు ఉండేవి కావు. ఉన్నా ఈ నాటి వాటిలా ఉండేవి కావు. అయితే ఆ మాట అనటంలో ఉద్దేశం యేమిటి అంటే, ఇది అయి ఉండవచ్చు. పౌరాణిక చిత్రంలో గిటారులూ, అకార్డియనులూ వినిపిస్తే అసహ్యంగా ఉంటుంది. కాని సాంఘికాలు, కర్నాటక వర్ద్ధిల్లో వినిపిస్తే అలా యెబ్బెట్టుగా ఉండదు. నిజానికి ఆ కాలంలో గిటారూ, అకార్డియన్‌తో బాటు ఫిడేళ్లు కూడా ఉండి ఉండవు. కాని మన చెవికి మొదటిది తోచినట్లు రెండవది యెబ్బెట్టుగా తోచదు. అలాగే "జక్కన్న" సంగీతంలో అలా యెబ్బెట్టుగా తోచే జంత్ర సమ్మేళనలూ, వాద్య ప్రయోగాలూ లేవని వారి ఉద్దేశమై ఉంటుంది. ఇది కొంతవరకు నిజమే.

ఇక పాటల నొకటొకటి పరామర్శించే ముందు వాటి కమర్చబడిన నృత్యం గురించి కూడా మనం కొంత చెప్పుకోవాలి. మామూలు యుగళ గీతానికి నడుము తిప్పడమైతే చెప్పుకోవడం అనవసరం. కాని ఇందులో కొన్ని శుద్ధ నృత్య గీతాలు. వాటి ప్రసక్తి ముందు.

జావళీల పద్ధతిలో రాగ రచన జరిగినది "అందాల బొమ్మతో ఆటాడవా" (జి.ఇ. 35386) "నగుమోము చూపించవా" (జి. ఇ. 35376) మొదటి పాట వ్రాసినది దాశరథి. పల్లవి, రెండు చరణాలు కాఫీరాగంలో మూడవ చరణం బహార్ రాగంలోనూ ఉన్నవి. 'నగు మోము చూపించవా' సి. నారాయణరెడ్డి రచన. రాగం భాగేశ్వరి. రెండు పాటలలోనూ రమ్యమైన ప్రయోగాలున్నాయి. 'కనులు కేవలి గంతలు వేసి, మనసు తోటలో మల్లెలు పూసి," "కలువ పూవులకయ్యా పిలిచేను రావయ్యా, వెలవెంకలిరి నన్ను అలరించ వేమయ్యా" వంటివి, విశిష్టమైన జావళి పద్ధతిలో జరిగలేదు రచన. "అందాల బొమ్మ, వసంతమైన రేయి," "ఎదుట వెన్నెల వంట ఎదలో తీయని మంట" అన్నవి భావగీతాల కోవలోకి చెందేవే. సుశీల మొదటి పాట చాలా బాగా పాడింది. రెండవది అంత బాగా పాడినా రికార్డింగ్ దోషం వలన అంత చక్కగా లేదు.

చిత్రంలో ఈ రెండు నృత్యాలు రాణించ వలసినంతగా రాణించక పోవటానికి కారణం నిర్లక్ష్యం. ఆడిన సరోజాదేవి, ఆడించిన హీరాలాల్, దండాయుధపాణి, చూస్తుండిన రంగాల నిర్లక్ష్యం. నిర్లక్ష్యం అనటానికి, చేతగాని తనం అనక పోవటానికీ చాలా కారణం ఉంది. సరోజాదేవి "విజయనగరం వీరపుత్రునికథ"లో "మధుర మోహన వీణా నాదనా" పాట అభినయం అతి చక్కగా చేసింది. పద్మినీ రూపం అమోఘంగా చూపింది. ఇక హీరాలాల్, దండాయుధపాణి అపూర్వంగా నిర్వర్తించిన నృత్యాలు తెలుగు తమిళ చిత్రాలలో సుమారు వందకు పైగా ఉంటాయి. ఛాయ గ్రాహకుడైన రంగా "తెనాలి రామకృష్ణ"లో "ఈవేగా రారా జీవగా" అన్న పాటను యెంత మనోజ్ఞంగా చిత్రీకరించారు ?

"జక్కన్న" పై పాటలలో ముఖంలో అభినయం అసలు చూపలేదు సరోజాదేవి. పరదా [illegible] నేసిక సూర్యకాంతం [illegible] అంతక ఎదిరెట్లు బాగా ఉన్నది ఈ కృష్ణ ఉద్య



'దాగుడుమూతలు'లో సరోజా దేవి, శారద.

కలిగింది. ఒక ముక్తాయింపును కూడా కాలితో పలికించలేదు. పాటలో కూడా తోచినప్పుడు అడుగు వేస్తుంది. అంతే. అదే అంజలీదేవి స్వంత చిత్రాలలో, భానుమతి చిత్రాలలో (భారంగా ఉన్నప్పుడు చేసిన 'మేలాయె నీవేళ' చేసినప్పుడు కూడా) గమనించండి. తాళాన్ని అడుగు తప్పినా, వేయవలసిన చోటల్లా వేయక పోయినా, నా చెవి కోయింపుకుంటాను. రంగా ఛాయాగ్రహణానికి ఈ నృత్య సన్నివేశాలలో నిజంగా గ్రహణం పట్టి నట్లు ఉంది. ఎంత సేపు యెలా పాదాలను చూప కుండా ఉందామనే ఆవేదనే తప్ప మరొకటిలేదు. ప్రేమలో లేనంత మాత్రాన, కాళ్ళాడుతున్నవో లేవో గ్రహించగల సామర్థ్యం చూపరులకుండదా?

సరోజాదేవి నృత్యంలో "మనసే వికసించెరా" కాస్త నయం. దీనికి హీరాలాల్ బాధ్యుడు. అభినయానికి అంతగా ప్రాముఖ్యత ఇవ్వకపోయినా నడియాడిన కదలికను మాత్రం స్పష్టంగా చూపారు. హిందోళంలో ఉన్న (ఎన్. 69809) ఈ పాట నడకకు ఆధారం పి. రామచంద్ర. రచన స్వతంత్రము. దాశరథి. మృదుల ప్రయోగ సమన్వితము. "మన్మథుని పూలబాణమ్ములా, మాధవుని వేణుగానమ్ము లా" ఈ అందంలో పదోవంతు ఛాయ ఆఖరి చరణంలోని పేలవత్వాన్ని దాచేయడానికి. సుశీల, ఘంటసాల ఉత్సాహంతో పాడారు.

"రామప్ప" శ్రవ్య నాటిక కోసం సి. నారాయణరెడ్డి వ్రాసిన మధురగీతి 'ఈ నల్లని రాలలో' "ఇక్కన్న"లో మొదటి పాట. రచన అత్యంత రమణీయము. ప్రతి పదములోను ఒక సుందరత భాసిల్లుతున్నది. వాద్య గోష్ఠిలో ఉలుల శబ్దాన్ని చిత్రీకరణలో సద్వినియోగ పరచక పోవటం ఒక దోషం. కాని "పైన కఠినమని పించును, లోన వెన్న కనిపించును" మాటల వంటివి స్వల్ప దోషాలు కానరావు. (ఎన్. 69771) ఈ రికార్డు చాల ముందు విడుదలైనది. బాగా అమ్ముడు పోతున్నది.

## అవీ - ఇవీ - అన్నీ

### అమెరికాలో నాగేశ్వరరావు

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అమెరికా పర్యటన ముగిసే ముందుగా, ఆంధ్రుడైన పత్రికా రచయిత డా. పి.జి. కృష్ణయ్య ఆయనతో అక్కడ ఇంటర్వ్యూ జరిపి, పలు విషయాలు ముచ్చటించారు. నటుడు నాగేశ్వరరావు అమెరికా అనుభవాలూ అనుభూతులను గురించి ప్రస్తావించడం కూడా జరిగింది.

కృష్ణయ్య అడిగిన ప్రశ్నకొకదానికి సమాధానమిస్తూ "నేను అమెరికా దేశపు అతిథిగా వచ్చి వెళుతున్నాను. ఈ దేశాన్నంతా పర్యటించే అవకాశమూ, పలురకాల వ్యక్తులను కలిసే సందర్భమూ లభించాయి. అమెరికన్ల సహృదయత, సౌజన్యమూ నాకు లభించాయి. ఈ దేశంవారికి ఇండియా అంటేను, ఇండియన్లంటేనూ ఎంతో ఆసక్తి ఉన్నట్లు నాకు బోధపడుతున్నది" అని శ్రీ నాగేశ్వరరావు అన్నారు.

హాలివుడ్‌లోని స్టుడియోలకు గల పోలికలను వివరిస్తూ, "హాలివుడ్‌లోని స్టుడియోలలో ఉన్న సాంకేతిక పరికరాల విషయంలో ఆక్షేపణ ఏమాత్రం లేదని అన్నారు. అంతే కాదు. అమెరికా స్టుడియోలు తమకున్న అపారమైన వసతులు, ఆర్థిక సదుపాయాలతో ఎలాంటి ప్రగతిని సాధించిందో, మనం కూడా మన తాహతుకు తగినట్లుగా, మనకున్నకొద్ది పాటి సౌకర్యాలతో ముందున్నాం" శ్రీ నాగేశ్వరరావు అన్నారు.



"శ్రీ సత్యనారాయణ మహాత్మ్యం" కాంతారావు, గీతాంజలి.

ప్రపంచ ఖ్యాతిపొందిన న్యూయార్కు 'థియేటర్' గురించి ప్రస్తావిస్తూ, శ్రీ అక్కినేని తాను కున్న కొద్ది కాలంలోనే న్యూయార్కులో రెండు ఉత్తమ ప్రదర్శనలను చూచానని, ఇక్కడి రంగస్థలం తనను సంభ్రమాశ్చర్యాలలో ముంచి వేసిందని అన్నారు—తాను తెలిసికొన్న ఈ కొత్త విద్య విషయాలన్నీ, ఇండియాకు తీసికెళ్ళగలనని ఆయన అన్నారు. "రేడియో టెలివిజన్లు అమెరికన్ల జీవితంలో ఒక భాగంగా తయారయ్యాయి. ప్రతి ఇంట్లోను రేడియో ఉండటం గమనించాను. రేడింటిలోను మంచి ప్రోగ్రాములున్నాయి. కానివివిధవస్తువుల వ్యాపార ప్రకటనల కోసం చాలా సమయం వినియోగించటం వెటుగా కనిపించదు. ఈ ప్రకటనలు అవసరమే కావచ్చు కాని వీలయినంత తగ్గింపబడి ఉండాలి." అని శ్రీ అక్కినేని అన్నారు.



అమెరికాలో శ్రీ పి. డి. కృష్ణయ్య ఆఫీసులో: ఎ. నుంచి కు. శ్రీయుతులు జి. రామమూర్తి, పి. ఆర్. రెడ్డి, వి. ఆర్. మోహన్‌రావు, ఎస్. ఆర్. రావు, వి. ఎస్. చంద్రుడు నుంచుని ఉన్నారు. వారి ముందు శ్రీయుతులు నాగేశ్వరరావు, కృష్ణయ్యలు.

## సినిమా వార్తలు

నాకు తెలుసు. ఏమంటే నేను ఒంటరిగా ఉండలేక పోయాను అదే మాదిరిగా మీకూ అనిపించడం సహజం— నిజమేనా ?"

"వూ !"

"వూ ! ఉండండి! మీరు మాట్లాడరా ? సిగ్గు పడుతున్నారా ? నేను కూడా సిగ్గు పడుతున్నాను. ఎలా మరి ? మాట్లాడే తీరాలి. ఆ ఫోటోను తీసుకు రావాలన్నాగా తీసుకుని వచ్చారా . . . . నాకు తెలుసు లెండి మీరు తీసుకొనే వచ్చుంటారు. ఇయ్యండి "

"పిల్లేదు "

"పొండి ! చాలు వేళాకోళాలు ఇయ్యండీ ?

"మిస్టర్ మిమ్మల్నిక్కడకు పిలిచింది ఫోటో కోసం కాదు. పాఠం చెప్పడానికి

"ఆహా ! బ్రదర్ నీకు మంచి ఛాన్సురా ! ఏమంటే స్టూడెంటుగా నేను మీ వద్ద ఉండడం అదృష్టం కాదా ? కానీండి ! కానీండి !"

" ఛీ! ఛీ! బుర్రా బుద్ధీ లేకుండా ఒక అమ్మాయిని ఫోటో అడగటం— ప్రక్కనే వచ్చి చేరడం కోరికోరి మాట్లాడడం మీకు సిగ్గనిపించలే. ఇకపై ఏ అమ్మాయి దగ్గరా దయచేసి ఈ ప్రకారం చేయకండి. క్లాసు పూర్తయింది. ఇక మీరెళ్ళవచ్చు "

"పూర్తయిపోయిందా ? అప్పుడైతే నా పైన మీకు ఒక వలపు, ప్రీతి, ప్రియం . కా . కా. . కాని ఇంకేం లేదంటారా ?"

"లేదు "

"ఆహా ! లోకం మాయరా ?"

" . . . . ."

"ఇదిగో మాటండీ ! ఆఁ ! నా మాట వినండి ? మీ హృదయాన్నడిగి చెప్పండి ! నా పైన మీకు ప్రేమ లేదంటారా ?"

"లేదు— లేదు— లేదు "

"ఏంట్రా మనగతి ? నేను జీవించి ఉండడం ఏం ప్రయోజనం ? ఆత్మహత్యే— ఇదుగో నాపైన ప్రేమ లేదని అన్నారంటే నేనిదే పోయి చనిపోతా"

"చావండి "

"హహ ! నేను వేళాకోళానికి అనలా తప్పకుండా నేను చచ్చిపోతా "

"ధైర్యంగా పోయిరండి "

"కొంచెం కూడా అనురాగమనేది లేదా ?"

"ఊహుఁ ?"

"వో మాటండి. స్త్రీ బుద్ధి ప్రళయాంతకం అంటారు మనం కొద్ది రోజులైనా కలిసి మెలిసి ఉన్నాం. అందుకనే చెప్తున్నాను నేను పోయాక నన్ను తలచుకొని చాలా బాధ పడతారు అందువల్ల మీచివరి మాటేదో చెప్పండి "

"నాకు నా మాట మార్చే అవసరమే లేదు "

"పదరా ! పద ! నీకు ఆత్మహత్యే గతి."

"ఏమండీ !"

ఈ సన్నివేశం శ్రీ దేవి పిక్చర్సు వారి "విచిత్ర వ్యక్తులు" చిత్రంలోనిది

### లక్ష్మీనారాయణ చిత్రం

దేవీ చిత్రాలయా తొలి చిత్రం "లక్ష్మీనారాయణ" కి అరుణాచల స్టూడియోలో ఒకపాట, 3 శ్లోకాలు రికార్డింగ్ జరిగాయి ఈ చిత్రానికి దర్శకత్వం శ్రీ మానాపురం అప్పారావు. నిర్మాత, అమరనాథ్. అసోసియేట్ నిర్మాత ఎస్. భీమ శంకర్రావు. పాటలు మాటలు రాజశ్రీ అని తెలుస్తోంది కాంతారావు, కృష్ణకుమారి, అమర్‌నాథ్, నాగభూషణం, రాజశ్రీ మొదలగువారు నటిస్తారు

### విచిత్ర వేషధారణ

చెన్నపురి ఆంధ్రమహాసభ జరుపుకొన్న వార్షికోత్సవ సభకు సంఘం అధ్యక్షులు శ్రీ వై. వి. సోమయాజులు అధ్యక్షత వహించారు ఉపన్యాసానంతరం విజయనగరం హిందీ పండితులు శ్రీ ఉర్లి అప్పల నరసయ్య తాము హిందీలో రచించిన గీతాలను చదివారు శ్రీ కోట రంగయ్యశాస్త్రి ఆశువుగా శ్లోకాలు, పద్యాలు చెప్పారు

సినీ ఆర్టిస్టు శ్రీ కాశీనాథ్ తాతా, ప్రదర్శించిన మిమిక్రీ, విచిత్రవ్యక్తులు, వింత అలవాట్లు ప్రేక్షకులను బాగా ఆకర్షించాయి

సి. ధర్మారావు. ★

### స్వీకారం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రథమ బహుమతి పొందిన ఆదివిష్ణుగారి " మనిషి — మిధ్య " నవల, గంగాధర్ ముఖచిత్రాలంకరణ చేసినది పుస్తక రూపంలో వెలువడింది పుటలు 294, వెల అయిదు రూపాయలు, ప్రతులకు : ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, కొత్తపేట, విజయవాడ — 1.

*  *  *

" హాయి హాయి ఈ రేయి " అనే విశ్వప్రసాద్ గారి పాకెట్ సైజు — సాంఘిక నవల మా కార్యాలయం చేరింది 158 పేజీల ఈ నవల వెల : 125 నయాపైసలు ప్రతులకు భగవాన్ పబ్లికేషన్స్, మద్రాసు — 24 ★

## జన్మదినఫలం

### 19 వ పేజీ తరువాయి

ఒకటి జరిగేది మరొకటిగా ఉంటుంది. కాని జరిగినవి కూడా మీకు ఒక విధంగా అనుకూలంగా ఉండడం వలన ఫరవాలేదనే సంతృప్తి కలుగుతుంది వ్యాపారంలో ఆదాయం పెరగదు గాని శ్రమ మాత్రం పెరుగుతుంది భారీఎత్తున చేసే వ్యాపారాలు కొంతకాలంపాటు వాయిదా వేయడం మంచిది వృత్తిలో చెప్పతగిన మార్పులు రావు ఉద్యోగంలో ప్రయోజనంలేని ప్రయాణ కలుగుతుంది విశేషమైన అనుకూలతను ఆశించడానికి సమయంకాదు ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని కాలడం, జారిపడడంవంటి ప్రమాదాలు కలగవచ్చును శుభ కార్యాల విషయంలో కొంచెం అభివృద్ధి ఉంటుంది బంధువులకు సహాయం చేస్తారు సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు ఆహార పదార్థ వ్యాపారులకు, వైద్యులకు మంచి సమయం.

### జూన్ - 23

ఈ సంవత్సరం విచిత్రంగా ఉంటుంది. మీకు స్వతహాగా యిష్టంలేకపోయినా కార్యసిద్ధికోసం కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులతో కలసి వ్యవహరించవలసి ఉంటుంది. మొత్తంమీద ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే బాగా ఉంటుంది నూతనంగా ప్రారంభించిన వ్యాపారాలు లాభిస్తాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాలు కూడా బాగానే ఉంటాయి వృత్తిలో అనుకూలమైన మార్పులు రావచ్చును ఉద్యోగంలో చెప్పతగిన మార్పులురావుగాని ఆదాయం పెరగడానికి అవకాశం ఉన్నది మీకు అంతగా ఇష్టం లేకపోయినా కొన్ని వ్యవహారాలు కోర్టు వరకు వెళ్ళగల సూచనలు ఉన్నాయి అప్పుడప్పుడు రక్తసంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. కొంతకాలం కుటుంబానికి దూరంగా ఉండవలసిన పరిస్థితి ఏర్పడుతుంది విద్యార్థులు కొంచెం శ్రమ మీద కృతార్థులు కాగలరు జనవరి, ఫిబ్రవరి నెలల్లో ప్రయాణం ద్వారా కార్య సాధన

### జూన్ - 24

ఈ సంవత్సరంలో అప్పుడప్పుడు కష్ట చికాకులు కలిగినా మొత్తంమీద సంతృప్తికరంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో ధన నష్టం రావచ్చును భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తికి సంబంధించిన నూతన విషయాలను తెలుసుకొంటూంటారు ఉద్యోగం సామాన్యంగా ఉంటుంది మీ అభ్యుద్ధిని సహించలేని కొంతమంది వ్యక్తులు పనిగట్టుకొని దుష్ప్రచారం చేయడంవలన మీకు మనశ్శాంతి లభించదు. స్థిరాస్తికి సంబంధించిన వ్యవహారాలు సాధ్యమైనంతవరకు వాయిదా వేయడం మంచిది ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది కుటుంబ వ్యవహారాల్లో చిన్న చిన్న మార్పులు రావచ్చును నిష్కారణంగా బంధువులు మిమ్మల్ని అపార్థం చేసికోగల ప్రమాదం ఉంది ప్రేమ వ్యవహారాల్లో స్వల్ప ప్రోత్సాహంలభిస్తుంది విద్యార్థులు సాధారణంగా కృతార్థులుకాగలరు.

### జూన్ - 25

జీవితంలో ముఖ్యమైన సంవత్సరాల్లో ఇది ఒకటి. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారాల ప్రభావం చాలకాలంవరకు ఉంటుంది. కాబట్టి జాగ్రత్తగా ఆలోచించి వ్యవహరించడం అవసరం వ్యాపారంలో ఆకస్మిక ధనలాభం కలగగల సూచనలు ఉన్నాయి మీ అభిప్రాయాలను అమలు జరపడానికి కావలసిన అవకాశం లభిస్తుంది. దానివలన లాభిస్తుంది వృత్తిలో కూడా పూర్తిగా అనుకూల వాతావరణం ఏర్పడి ఆదాయం పెరుగుతుంది ఉద్యోగస్థులకు ఉన్నతస్థానం లభించగల సూచనలు ఉన్నాయి ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. మీ తాలూకు విలువైన వస్తువులు పోయే ప్రమాదం ఉన్నది. రాజకీయాల్లో కొంత ప్రతిఘటన మీద విజయాన్ని సాధిస్తారు విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. 

Edited, Printed and Published by S Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street Madras-1. Phone, 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



"దాగుడుమూతలు" లో సరోజాదేవి, రామారావు


Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.